

## అంజయ్య ఊరెళదాం రండి

వాళ్ల నాన్న అంజయ్యని ఇంటి నుంచి పొలానికి తీసుకెళ్లి
నట్టే, అంజయ్య కలంవేలు అందించి
నిన్నూ నన్నూ హైదరాబాద్ నుంచి వాళ్ల వూరు తీసుకెళ్తాడు.
లేని నాన్ననీ లేని అమ్మ నీ మనకి గొప్పగా ఇంట్రడ్యూస్
చేస్తాడు. వాళ్ల గుడిసె అంతా చూపిస్తాడు అదేదో తాజ్‌మ
హల్ అయినట్టు. పొలానికి పట్టికెళ్తాడు.
కంకులు మన చేతికిస్తాడు. కష్టాలూ కన్నీళ్లూ కలిపి మనజేబు
లో వేస్తాడు. అవిపోయెమ్స్ అనీ కోహినూర్లని
నమ్మబలుకుతాడు. చచ్చినట్టు నమ్మాల్సిందే. చిన్ననాటి జ్ఞా
పకాలని సారెమీద పెట్టి తిప్పి చేతులు పట్టి కల్లుముంతలు
చేసి తాటాకుల్తో తాగిస్తాడు. అది అమృతమనీ అందు వలన
మీరు అమరులనీ అబద్ధాలు చెప్తాడు.
అంజయ్యని నమ్మొద్దు. దొంగ.

పునాస * వైదల అంజయ్య

# పునాస

వైదల అంజయ్య





తైదల అంజయ్య

# పునాస



మంజీర రచయితల సంఘం
సిద్ధిపేట



# PUNAASA

## TAIDALA ANJAIAH


Collection of Poems

*First Edition* : June 2006

*Cover Design & Illustrations*
**Mohan**

*Published by*
**Manjeeja Rachayitala Sangham**
Siddipeta

*Copies available at* : **Visalandhra Book House,** Hyderabad and its branches in A.P., **Prajashakti Book House,** Chikkadpally, Hyderabad and its branches in A.P. , **Navodaya Book House,** Badichowdi, Hyderabad, **Disa Pustaka Kendram,** Chikkadpally, Hyderabad, **Navodaya Publishing House,** Eluru Road, Vijayawada.

*Composed at:* **Akshara Creators,** AG-2, A-Block, Mathrusri Apts., Hyderguda, Hyderabad. Ph: 23244088

*Printed at:* **Charita Impressions**, Azamabad Industrial Area, Hyderabad. Phones: 040-27678411, 55295078

Rs. **40.**




నన్ను గని,
నా 'రాత' గనకుండా
వెళ్ళిపోయిన
**అవ్వకు... అయ్యకు...**

# బతుకవోయిన బాల్యం నుంచి...

నాకు ఊహ తెలిసేటప్పటికే నాదికాని వూళ్లో వున్న. నేను మూడేండ్ల పోరనప్పుడు బాకీల బాధలకు వలసపోయినం. ఏ మోదుగుచెట్టు కిందనో నను కూర్చోబెట్టి కొంతమంది కూలీలతో కలిసి అయ్య మన్ను తవ్వేటోడు, అవ్వ తట్ట మోసేది. అక్కడ పనిచేసే వాళ్లంతా మావూరి కూలీలే! నాకు తాత వరసయ్యే వాళ్లు నాతోటి పాటలు పాడించుకునేటోళ్లు. పీరీల పండుగకు 'అలువ' చుట్టు ఆడుకుంట కైగట్టి పాడేపాటలవి. ఒక సంవత్సరం తర్వాత బడికివోయిన. ఎక్కడ చిన్న పేపరు ముక్క కనపడ్డా పూర్తిగా చదివిన తర్వాతనే పారేసేటోన్ని. అక్షరాలంటే అంత ప్రేమ! ఆ వూరోళ్లంతా 'తూరుపొల్ల పోరడు ఉషారున్నడు' అనేటోళ్లు. అప్పుడే చిరుతల రామాయణం, చందమామ కథల పుస్తకాలు అడుక్కొని చదివేటోన్ని. మూడేండ్ల వలస బాల్యం తర్వాత తిరిగి మావూరును చూసిన. నా వూరు నాకే కొత్త. రెండేండ్లు మా వూళ్లో చదివి తర్వాత 5 కి.మీ. దూరంలో వున్న బస్వాపూర్‌లో 10వ తరగతి వరకు 6 సంవత్సరాలు నడిచి చదువుకున్న. దారి మధ్యలో వాగుండేది. నా చిన్నప్పటి ఊహా ప్రవాహమది. ఒక్కపూట బడి వున్నన్ని రోజులు పట్టపగలు ఉశికెల కాళ్లు గాలకుంట పాదాలకు మోదుగాకులు కట్టుకుని నడిచేవాన్ని చెప్పుల్లేక! వాగులో చెలిమె తోడుకొని నీళ్లు తాగేవాళ్లం. వానకాలం పిట్టగూళ్లు చేసేవాళ్లం.

సెలవులప్పుడు అయ్యతోని అడవిలో మేకలు కాసేవాన్ని. ఆకలయినప్పుడు 'సిల్వక్క కాయలు' (సీతాఫలాలు) కాల్చుకొని తిని జాలునీళ్లు తాగేటోళ్లం. రాత్రి నేను నిద్రపోయెదాకా అయ్య కథలు జెప్పెటోడు. ఒకే కథను మరోసారి మరో విధంగా చెప్పేటోడు. కాముని పున్నమపుడు అవ్వతోటి దిరిగి హోళి పాటలు వినేటోన్ని. అవ్వవాళ్ల బృందంలో ప్రధాన గాయకురాలు! ఎండకాలం సోపతిగాళ్లతోటి ఈతలు గొట్టుడు, చెరువుమట్టి తోటి ఎడ్లు జేసుడు, ఎన్నీల రాత్రుల్ల ఆటలే ఆటలు! రాస్తెగాదు గని చెపుతే కథలైతయ్!

చదువులో ముందున్నందుకు ఉపాధ్యాయులు ప్రోత్సహించేవారు. క్లాస్‌మేట్స్ అభిమానించే వారు. బడిలో తెలుగుసార్ చెప్పే కథలు ఊహాజనితంగా వుండేవి. ఆయన పద్యాలు రాయండని చెప్పేవాడు. అట్లా పద్యాలు రాసే అభ్యాసంలో...

*ఎద్దులు గాసేవానికి*
*గద్దరుకున్నంత పవరు గలిగిననాడే*
*గద్దెల నెక్కిన నేతల*
*పెద్దరికము రద్దు యగును పిడుగుల కవితా !*

అనే పద్యం వచ్చింది. ఇది నేను 10వ తరగతిలో రాసిన పద్యం మరికొన్ని కంద పద్యాలతో పాటు వంద ఆటవెలది పద్యాలు రాసిన.

ఇంటర్మీడియెట్‌లో చేరినపుడే మొట్టమొదలు సిద్ధిపేటను చూసుడు! ఆ రెండేండ్లు భయంకరమైన ఆకలితో గడిచింది. డిగ్రీ ఫస్టియర్లో రూం కిరాయి లేక మరియు చిత్రలేఖనంపై నాకున్న ఆసక్తితో ప్రముఖ చిత్రకారులు శ్రీ కాపు రాజయ్యగారి వద్ద కళాభవన్‌లో వున్నాను. అదే సంవత్సరం సిద్ధిపేట డిగ్రీ కాలేజి కవితల పోటీలో మొదటి బహుమతి వచ్చినపుడు బహుమతి కన్న ఎక్కువగా నన్ను అభినందించి అక్కున చేర్చుకున్న నందిని సిధారెడ్డి సార్ నా గాడ్‌ఫాదర్! అదే ఆయనతో నా మొదటి పరిచయం. నా ఉద్వేగాలను, నా ఊహలను, నా



దుఃఖాన్ని కవిత్వంవైపు మరల్చిన ఆదర్శ మార్గదర్శి ఆయన. ఆరోజు సార్ నను 'మంజీర' లో ఒక పాయగా చేర్చుకొని వుండకపోతే నేనివాళ లేను. నాకు ఆర్థికంగా సహకరించి, బతుకు లోని కఠినత్వాన్ని, సున్నితత్వాన్ని వివరించిన నా అసలైన గురువు ఆయన. బతుకుమీద ప్రేమను పెంచి, పుస్తకాలు చదివించి నన్నిట్ల కొనసాగింపజేసిన ఆయనకు నేను సదా ఋణపడి వుంటా! నా బాధలన్ని తీర్చిన సైకియాట్రిస్ట్ ఆయన. వాళ్ల ఇంటికి వెళ్లినపుడల్లా నా దుఃఖం నుంచి ఊరట పొందేవాన్ని. ప్రతి బుధవారం సార్ వాళ్ల ఇంట్లో మంజీర మిత్రులమంతా కవిత్వం చదువుకునేవాళ్లం. నా కవితలు విని దేశపతి శ్రీనివాస్‌గారు, 'అంజయ్య కవిత్వంలో వయసును మించిన తాత్వికత వుంది,' అంటే, 'లైఫ్ అది. పచ్చిగాయాల బాధ,' అని సిధారెడ్డి సార్ అంటుండె. సిద్ధిపేట వాడలల్ల నా భుజం మీద చెయ్యేసి నను కవిత్వంలో నడిపించిన పాటల సోపతి దేశపతి శ్రీనివాస్‌గారి ఎంకరేజ్‌మెంట్ మరపురాదు. ఆయనేకాదు మంజీర మిత్రులంతా అంతే! వాళ్ల గురించి ఎంత చెప్పినా సరిపోదు. నా జీవితాన్ని మలుపు తిప్పిన మహానది మంజీరా రచయితల సంఘం! మంజీర కవులందరికీ పేరుపేరునా నా ధన్యవాదములు.

అంతకుముందు నన్నెప్పుడు చూడకున్నా దేశపతి శ్రీనివాస్‌గారితో పరిచయం వల్ల ఈ పుస్తకానికి ప్రేమతో ముందుమాట రాసిన వరవరరావుగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఇందుకు సహకరించిన ఎన్. వేణుగోపాల్‌గారికి నా మనస్ఫూర్తిగా ధన్యవాదములు తెలియ జేస్తున్నాను.

మెదక్‌లో మరసం వార్షికోత్సవ సభలో నేను మొదటిసారి చూసిన శివారెడ్డి సార్, ఆ తర్వాతి సభల్లో నా కవితలు విని నన్ను ఎంతో ప్రోత్సహించారు. వారి ప్రేమ, ప్రేరణ మరపురానివి. కవిత్వపు నూతన పోకడలను తెలిపే పుస్తకాలిస్తూ, నన్నెపుడూ కవిత్వం రాయాలని నాకు మరో ముందుమాట రాసిచ్చిన శివారెడ్డిగారికి నేనెప్పుడూ కృతజ్ఞున్ని.

నా కవితలకు బొమ్మలు వేయడంలో ప్రముఖ చిత్రకారులు మోహన్‌గారిని పరిచయం చేసిన మా సిద్ధిపేట ప్రభాకర్‌కు, నేను కోరకున్నా తనకుతానే కవితలన్నిటికీ బొమ్మలు వేసిన మోహన్‌గారికి ధన్యవాదములు.

పుస్తకాన్ని అందంగా తీర్చిదిద్దిన వాసిరెడ్డి నవీన్‌గారికి, చక్కగా కంపోజ్ చేసిన సీతగారికి, ముద్రించిన సుబ్బయ్యగారికి కృతజ్ఞతలు.

నా కవితలను ప్రచురించిన ప్రజాసాహితి, వార్త, ఆంధ్రజ్యోతి, సంతకాలు, సోయి, నేటినిజం సంపాదకులకు...

చిక్కనవుతున్న పాట, దూదిపూల దుఃఖం, నూరు అలల హోరు, ఎడపాయలు, మొగులైంది, పాట సంతకం, పొక్కిలి, మత్తడి సంకలనకర్తలకు...

నా కవితను మెచ్చిన 'రంజని-కుందుర్తి'కి...

నా 'చాటింపు' కవితను తమ వార్షిక సంచికలో ఇంగ్లీష్‌లోకి అనువదించిన కాకతీయ యూనివర్సిటీ ఇంగ్లీష్ డిపార్ట్‌మెంట్‌వారికి...

మా వూరుకు, నా బాల్యమిత్రులకు, నా కుటుంబసభ్యులకు, నా సహచరి రాజేశ్వరికి...

ఇంకెందరికో పేరుపేరునా

నా ధన్యవాదములు.

**– జైదల అంజయ్య**

# కవిత్వమే పరిచయం

## వరవరరావు

పద్నాలుగు సంవత్సరాల క్రితం జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం క్వార్టర్స్‌లో ప్రొఫెసర్ జీ.పి. దేశ్‌పాండేను కలిసినపుడు ఆయనలో నాకు ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ పాఠకులందరికీ సుపరిచితుడైన జీపిడిని కాకుండా నాటక రంగంతో పరిచయమున్నవాళ్ళకు సుప్రసిద్ధ నాటక రచయిత, ప్రయోక్త, సిద్ధాంతకర్త (మరాఠీ నాటకరంగానికి ప్రత్యేకించి)గా తెలిసిన దేశపాండేను కూడా కాకుండా ఒక అనూహ్యమైన సాహిత్య అభిమాని కనిపించాడు. చైనా విదేశాంగ విధానం గురించో, సంస్కృత, గ్రీకు, సుఖాంత, విషాదాంత నాటకాల గురించో, మార్క్సిస్టు గనుక బ్రెప్ట్ ప్రెసినియమ్ గురించో లేదా మరఠ్వాడా నుంచి దక్షిణదేశానికి వచ్చిన రంగస్థల నాటకం, సురభి గురించో కాదు మేం మాట్లాడుకున్నది. గంటలు గంటలు మరాఠీ దళిత సాహిత్యం గురించి ఆయన నోట ప్రశంసలు విన్నాను. అప్పుడప్పుడే అర్జున్ డాంగ్లే ఇంగ్లీషులో సంపాదకత్వం వహించి వెలువరించిన మరాఠీ దళిత స్వీయ కథలు, కవిత్వం, కథలు చదివి ఉన్నాను గనుక ఆయన వాటిలోని, ముఖ్యంగా దళిత స్వీయకథ (ఆటో బయోగ్రఫీ)ల్లోని జీవితాన్ని, జీవితమే కల్పనకన్న ఎంత గొప్పగా ఉంటుందో రుజువయిన కల్పన గురించి మరాఠీభాషలో చదివిన జీవిత సౌందర్యాన్ని వివరిస్తుంటే ఆ ఉదయం ఇప్పుడూ నా హృదయానికి హత్తుకొని ఈ మాటలు రాస్తున్నాను.

మరాఠీ సాహిత్య చరిత్రలో గొప్ప అధ్యాయం ఏదని మీరడిగితే తడుముకోకుండా, "దళిత స్వీయకథలు వెలువడిన కాలమంటాను. విచిత్రమేమంటే ఈ ఆత్మకథలు రాసేనాటికి వీళ్లెవరికీ 'ఆత్మ' అంటే ఏమిటో తెలియదు. ఎవ్వరూ తమ కథలు చెప్పేనాటికి ముప్పై దాటి ఉండరు. కాని నూరేళ్లది కాదు వాటిల్లో వేల ఏళ్ల, తరతరాల అనుభవం తాలూకు సారం రంగరించి పోశారు. అది రసాయనిక ప్రక్రియ నుంచి వచ్చిన సిరా కాదు. కండలు, నెత్తురు, ఆత్మాభిమానం, జీవితంలోని మెట్లు అన్నీ సలసల కాగికాగి, చిట్లిచిట్లి, ధ్వంసమై రూపెత్తిన ఒక కొత్త సృష్టి. నీ 'సంస్కారాన్ని' నిర్దాక్షిణ్యంగా ఖండించి స్వానుభవంలోకి తెచ్చుకుంటే తప్ప అందులో ఉన్న సంస్కారం సాక్షాత్కరించదు," అన్నాడు.

ఇవే మాటలు కావు. కాని ఇదే ఉద్వేగం. ఇదే భావ తీవ్రత.

1972లో సృజనలో 'దళిత పాంథర్స్'కు స్వాగతం చెప్తూ, 'సాగర్' రాసిన నాటి నుంచీ అక్కడక్కడ ఆ సాహిత్యానువాదాలు చదువుతూ ఇటీవల ఓంప్రకాశ్ వాల్మీకి 'ఝూటన్' (హిందీ)



చదివినదాకా - తెలుగులో ఇటువంటి స్వీయకథలు ఎందుకు రావడంలేదు, స్వీయ కథాత్మక కథలో, నవలలో తప్ప, అద్భుతమైన కవిత్వమో తప్ప - సూటిగా తమ ఆత్మకథలు ఎందుకు రాయడం లేదు అని అనుకుంటున్నాను. ముఖ్యంగా తెలంగాణలో (పూర్వ హైదరాబాదు రాష్ట్రంలోనైతే మరఠ్వాడా, హైదరాబాదు, కర్ణాటక కూడా వర్తిస్తుంది) దళితులకు ఒకవైపు 'వెట్టి' బతుకు ఉంది - మరొకవైపు జ్వాజ్వల్యమానమైన సాయుధ పోరాట అనుభవం ఒకటికి రెండుసార్లు ఉంది. ఈ కన్నీటికత్తిలోని పదను సాహిత్యాన్ని ఎంత సుసంపన్నం చేసి ఉండేది.

తైదల అంజయ్య కవిత్వం నన్నీ జ్ఞాపకాల్లోకి, ప్రశ్నల్లోకి జిజ్ఞాసలోకి ఎందుకు తీసుకుపోతుందంటే, 'పునాస' ఆశ్చర్యంగా వానాకాలపు పంటవలె ఉండడం. పరిగె ఏరుకునే వాళ్లు పంట గురించి రాయడానికి అభిమానపడినపుడు, ఆ పరిగె ఏరుకునే వాళ్ళే గాదెల కెత్తిన రాశులు పండించినవాళ్ళని వినమ్రంగా చెప్పడం చాళ్లల్లో గుసగుసగా ధ్వనించడం.

ఒక తాత ఉండేవాడు. ఆయన కరువుకు సంతానాన్ని అమ్ముకున్నాడు. ఒక అయ్య ఉండేవాడు. ఆయన అప్పులు తీర్చడానికి కడుపు కట్టుకొని వలసపోయాడు. కొడుకు చినిగిన అంగీలాగుతో బడిలో ఇంకా అస్పృశ్యునిగానే జండావందనం చేస్తున్నాడు దూరంగా నిలబడి.

ఆ ఊళ్లో (అది మీ ఊరూ, మా ఊరూ కావచ్చు) వేపచెట్టు కింద గుడిసె ముందు చెప్పులు కుట్టుకుంటూ ముసలయ్య బాగోతపు పాటలు పాడేవాడు. అమ్మలు పటేండ్ల ఇండ్లల్ల సోలెడు నూకల కోసం రోజంతా వడ్లు దంచిన రోకండ్ల చప్పుడు వినొచ్చేది. రాత్రి సిందోళ్లు ఏపాలేసి చావడికాడి బాగోతులాడే వాళ్లు. ఆశ్వీయుజ మాసం వెన్నెల రోజులైతే బతుకమ్మ ఆడే వాకిళ్లు కనిపించేవి. మూలసుక్క పొడిచినపుడు మోటల గిరుకల సప్పుడు వినొచ్చేది. రామచిలుక జోస్యాలు, కోయదొరల చేయిచూసుడు, పోరగాండ్లు తాటిమట్టలకు ముంజకాయల గీరెలు చేసి ఆడుకునే బండాట, పసులకాడి పిల్లలూగే ఊరవతలి మర్రిచెట్టు -

రజాకార్ల రోజులు. అంటే కమినిస్టుల రోజులు కూడ. సంగపోల్లు, గుత్పలోల్లు, చీకటోళ్లు, వాళ్లకు పోటీగానే ఇప్పటి సంఘపరివార్ దేశభక్తుల వలె, రాజ్యపరివార్ టైగర్ల వలె రజాకార్లు పుట్టుకొచ్చారు. ఆ రజాకార్ల కతలు చెప్పేవాడు అంజయ్య అయ్య. బాయిదరి మీంచి నీళ్లలోకి విసిరి మొల్దారం పట్టుకొని ఈత నేర్పిన గురువు ఆయన తండ్రి. మోదుగుదొప్ప నిండా బలుసుకు పండ్ల తీపినిచ్చి, వరి మొలకలకు దోసిళ్లతో నీళ్లు తాగించి, బొంబాయికి పోయిన అన్నకు తనతో ఉత్తరం రాయించి, జీవాల వెంటబెట్టుకొని 'మద్దికుంట', 'మునుల సెలిమె', 'దోమలగట్టు', 'దొంగబండ', 'పాయిరాల కంచె' పరిచయం చేసి, ఆదివారం అమాసనాడు కరకరపొద్దు పొడిసేయాళ్ల బతుకుతెరువు కోసం పాముమంత్రం నేర్పిన తండ్రి, ఆనాడు ఆ మంత్రం నిలువెత్తు విషపు మనిషి మీద అది పనిచేయదని ఊహించలేకపోయాడు.

అంజయ్య తండ్రి ఎన్నీలగాసేటపుడు చెప్పే 'కైత్కాల' కోసం వాకిలినిండా ఎంతమంది గుమిగూడేవారని. చెట్లమందులతో ఎందరి రోగాలను చంపాడో అతడు.

అంజయ్య తల్లి ఆమాటకొస్తే ఏ తల్లి అయినా, అందులో 'నోట్లో బంగారు చెమ్చా'తో పుట్టిన బిడ్డతల్లి కాదు. తైదలు ఇంటి పేరుగా మారిన వరి అన్నం కూడ నోచుకోని బిడ్డను కన్నతల్లి. భర్త చనిపోయాక ఏర్పడిన మనిషి ఖాళీతనంతో కడివెడు శోకాన్ని కొంగున కట్టుకొని పొలంగట్టు మీంచి నడిచి వెళుతుంది. వాళ్లు కష్టజీవులు గనుక ఆ దుఃఖాన్ని శూన్యం పంచుకోదు. గోరింకలు, చిలుకలు పంచుకుంటాయి. ప్రకృతి సౌందర్యం, పక్షుల తోడు జీవితంలో దైన్యాన్ని పంచుకుంటుంది.

దుఃఖం మరణాలకే పరిమితమైంది కాదు. కరువు, వలసలు, శిశువులను అమ్ముకోవడానికే పరిమితమైంది కాదు. దుఃఖం దైన్యం నుంచి స్పృహలోకి, చైతన్యంలోకి, ధిక్కారంలోకి మారుతుంటే గుడిసెలు కాలిపోతున్నాయి. కొడుకులు అరెస్టవుతున్నారు. కొడుకుల కోసం తలిదండ్రులు అరెస్టవుతున్నారు. బిడ్డలు కూడ అజ్ఞాతంలోకి పోతున్నారు. అజ్ఞాతంలోకి వెళ్లిన బిడ్డలకు పెళ్లిచేయకపోవడమే కారణమేమో అనుకునే అమాయకపు తల్లుల వేదనను దళంతో లేచిపోయిన, బూతుమాటలతో సంబోధనతో జల్లెడచేసే యంత్రాంగాలు గ్రామాల్లో దిగుతున్నాయి. గ్రామాల్లో యువత కనిపించని రాత్రిళ్లు. యువరక్తం ఎన్‌కౌంటర్ అయ్యే తెలంగాణ పల్లె.

ఈ మార్పు అంతా మెదక్ జిల్లా గిరాయిపల్లి అడవుల్లో జులై 25, 1975 నుంచి. ముప్పై ఏళ్ల నుంచి వింటున్న కథంతా అంజయ్య కవిత్వంలో చదువుతుంటే అంజయ్య ఆత్మకథ రాయడానికి కవితాఖండికలు ఎందుకు ఎంచుకున్నాడు - పైగా అంజయ్య వయస్సు సరిగ్గా ఎమర్జెన్సీ కీవలదే అనుకుంటాను. దీనికెంత వేగం, ఎంత ఉద్వేగం.

మననీ అయ్య, అవ్వ, ఊరు - అనే ఒక నాస్టల్జియా వంటి, చనుబాలవంటి జ్ఞాపకం నుంచి అంజయ్య - పరాయీకరింపబడిన ఊళ్లోకి మనుషులు కాని మనుషుల మధ్యకు తీసుకు పోతాడు. కనుక మొత్తం అంజయ్య కవిత్వాన్ని, ఈ పునాసతో ఉన్న ఖండికలను రెండు ప్రధానాంశాల వస్తువుగా లింగడించవచ్చు. ఎంత కరువు, దరిద్రంలోనయినా మోటమోసే మనిషిగానయినా మనిషిగా ఉన్న ఊరు మనుషులుగా మసలుకున్న ఊరు నుంచి పరాయికరింపబడ్డ ఊరులోకి మనను తీసుకవెళ్లి ఉసూరుమంటాడు. అక్కడే ఆయనకు 'పునాస'కు కూడా పనికిరాని మట్టితనం కోల్పోయిన మట్టి గురించిన మనాది.

మా ఊరు నుంచి అంజయ్య ఊళ్లోకి ప్రవేశిస్తాను. మా ఊరు చుట్టూ వడ్డాణం వలె రెండు వాగులు మూడు వైపుల ఉండేవి. ఆకేరుగా. వరదన్నపేట దగ్గర పెద్దదయ్యే వాగు, నపికల్లు దగ్గర నడుంచుట్టూ చెయ్యేసిన స్వర్ణగా ఉండేది. చెలిమల్లో నీళ్లు తోడుకునే బాల్యాల నుంచి క్రమంగా ఇసుక తోడుకునే లారీల దృశ్యాల్లోకి వచ్చాము. ఏ ఊళ్లోకయినా ప్రవేశించు - మట్టిని ధ్వంసం చేసే పొక్లయినర్లు పెద్దమాటయితే, ట్రాక్టర్లు, ట్రక్కులు వంటి చిన్న చీదరలయినా లేకపోలేదు. చెట్లు అదృశ్యమవుతూ కట్టెకోత యంత్రాలు వస్తున్నాయి. నీళ్లున్నచోట, కల్లున్నచోట బ్రాందీషాపులొస్తున్నాయి. ఏనెలు ఉన్నచోట క్వారీలు, స్టోన్ కట్టర్లు.



గర్భకోశం తొలగించని తల్లులు లేనట్లే యంత్రపుకోరలు చీల్చని మట్టిపొరలు ఎక్కడైనా ఉన్నాయా? అందుకే అంజయ్య, 'భూగోళం మీద యిపుడు లోహ మైదానం విస్తరిస్తున్నద'ని వాపోతాడు. యంత్రమవుతున్న మనిషి 'యినుపనవ్వు' నవ్వుతున్నాడంటాడు.

అంజయ్య ముందు రెండు ప్రత్యామ్నాయాలున్నాయి.

ఒకటి తెలంగాణ - జాడపట్టే పిలుపు - ఒకటే తొవ్వ 'ఉశికె'లో 'కాసెపుల్ల' దేవులాడే పిలగాండ్లకు అది తెలంగాణ, 'నా తల్లి తెలంగాణ'లో.

> *పంట నేను కాడ కాచుకుని చూచున్న*
> *బక్కరైతుల గుత్పకట్టెలూ,*
> *పొదలచాటు నుంచి పొంచి చూసే ఖడ్గనేత్రాలు*
> *పదునుగా విచ్చుకున్న గోగుపూలూ -*

బహుశా ఈ సంకలనంలోని ఒకే ఒక్క వ్యంగ్యకవిత - తెలంగాణ స్మాల్ అసెంబ్లీ.

> *నీరు ఆంధ్రనెరుగు*
> *నిజము తెలంగాణ మెరుగు*

ఒక తక్షణ పరిష్కారం.

ఈ తెలంగాణమే తొలిసారిగాను, మలిసారిగానూ చూపిన, చూపుతున్న ప్రత్యామ్నాయం, స్వావలంబనను, ప్రజాస్వామ్యాన్ని, దున్నేవారికి భూమిని హామీ ఇవ్వగల విప్లవమార్గం. ఈ విప్లవ మార్గంలో తైదల అంజయ్య కవిగా, భావుకుడుగా, శిశువుగా, మనిషిగా పరాయీకరణకు గురయిన ఊరి నుంచి, మనిషితనం నుంచి ఒక స్వచ్ఛమైన స్వేచ్ఛాయుతమైన గ్రామీణ జీవితాన్ని కలగంటున్నాడు.

తైదల అంజయ్య కవిత్వం కథ వలె అల్లాడని చెప్పడానికి ఎంత ఉత్సుకత కలుగుతున్నదో ఆయన కవితాచరణాలను, భావుకతను కూడ వెన్నెట్లో మనిషి రూపాల వలె పరచి చూపాలనీ అనిపిస్తున్నది. వెన్నెల కన్నీరును కూడ స్వచ్ఛంగా చూపుతుంది.

> *యాతం బొక్కెన నిండా నీటి కలలే!*
> *పగటి కలలంటంగని*
> *రాత్రి కలలు మాత్రం నిజమైతయా?*
> *బతుకు మారడమంటే*
> *రాత్రి నిద్దురలోకి రంగులనాహ్వానించుకుని*
> *కలలు గన్నంత సులభం కాదు*

భావుకత కష్టాల కొలిమిలో తాత్వికతలోకి మారినపుడు వచ్చే కవిత్వం జీవితాన్ని మరింత దగ్గరగా స్పృశిస్తుంది. అందుకే అంజయ్య ఆత్మకథ రాయడానికే ఎందుకు పూనుకోలేదనడం.

*పుట్టుక గాయమైనపుడు*
*కవిత్వం క్షతగాత్ర సంగీతం*
*ఏడ్చినపుడు వెన్నెలను*
*నిద్ర లేవంగనే సూర్యున్నీ చూసినవాన్ని*
*గాయాలతో పుట్టినవాన్ని*
*గాయానికి నేను భయపడడమేమిటి?*

❉

ఇపుడు కంప్యూటర్లు అర్థమైనంత సులభంగా సమస్య అర్థం కాదు.

శత్రువు అసలు కనబడడు.

అసలును మించిన వడ్డీగానో, ఆకాశాన్నంటే ధరరూపంలోనో, పంటకు పట్టిన చీడగానో.

ఇదంతా మామూలు - చాలామంది పరాయీకరణ మీద రాసే కవుల్లో చదువుకోవచ్చు - అంజయ్య సమకాలీన కవి - చలనశీల వర్తమాన కవి. అందుకే ఆమాత్రమే అని ఊరుకోక,

శత్రువు, నీ వెంటనే తిరిగే కోవర్టుగానో, ఏదో విధంగా వెంటబడుతూనే ఉంటాడని చెప్తూ, మళ్లీ మనల్ని భావుకతలోకి తీసుకవెళ్తాడు.

*మంచె మీద నక్షత్రాలు వెలిగించుకుని*
*గడ్డిపూల ఊయలలూగిన పల్లెలకిపుడు*
*పాములు చొరబడ్డ ఇంట్లో పల్లేరుగాయల నిద్ర*

❉

*మద్దిమాను మంచె మీద పైడికంటె కూత*
*తుమ్మల కంచెలో ముళ్లకూ, ముళ్లకూ మధ్య యుద్ధం*
*దున్నిన దుక్కిలో విత్తనంలో దాక్కున్న విషపుజన్యువు*
*విరిగిన డప్పు, వెదజల్లబడిన గజ్జెలు*
*ఖడ్గానికి ఉరితీయబడిన కోకిల*
*రెండు ఖండాలుగా నరకబడిన నెమలికాళ్లు*
*నాలుగు బజార్ల మధ్య తెగిపడ్డ శిరస్సు*
*ఛిన్నాభిన్నమైన మట్టిగొంతుల జానపద కచేరీ*
*....... ....... ....... ....... ....... .......*
*పిల్లలంతా చేరి జయించుకుంటూ సాగే ఉప్పాట!*



కవితగా భావుకత, ప్రకృతి పరిశీలన, మనుషుల అంతరంగాల, వ్యక్తిత్వాల ఆకళింపు కలగలిసి నిర్మాణపరంగా కూడ పరిణతి చెందిన 'నడిచే పాదాలు' బెల్లి లలిత కోసం రాసింది అని చెప్పకపోయినా గొప్పగానే వుంది.

ముగింపుగా ఒక మాట చెప్పాలి -

ఎన్నికలు అయిపోయి ఎన్నెన్నో వాగ్దానాలు చేసి 'నక్సల్ ఎజెండాయే మా ఎజెండా,' అని ప్రకటించిన తెలంగాణ రాష్ట్రసమితితో కలిసి కాంగ్రెస్ గెలిచిన మరుక్షణం - మరుభూమిగా మారిన తెలుగునేలపై ఒయాసిస్సులు వెతుకుతూ వచ్చిన మే నెలలో, తెలిసిన దేశపతి శ్రీనివాస్ మొదలైన మిత్రులు, నాకస్సలు తెలియని తైదల అంజయ్యను - నోట్లో నాలుక లేని, కలలంలోనే నాలుకయిన, జ్వలించే గుండె అయినా దాచుకున్న బిడియస్తుడ్ని వెంటబెట్టుకొని వచ్చి, అప్పటికింకా అనామధేయంగా ఉన్న ఆయన సంకలనానికి ముందు మాట రాయమని ఇచ్చారు. ఆరునెలల కన్నా ఎక్కువే గడిచిపోయాయి. చర్చలు, సభలు, స్థూపాల నుంచి - సందేహాలు, నిరాకరణలు, ధ్వంసాల దాకా చకచకా చాలా పనులు జరిగి పోయాయి. 'ఎన్‌కౌంటర్'ల హెచ్చరికలు చేస్తూ - కోవర్టులు యథాతథంగా కొనసాగుతున్నా, పనుల వల్లనే రాయలేకపోయాను ఇంతకాలం. అంజయ్య నోరు తెరచి అడుగనందువల్ల కూడ. కాని ఎందుకో ఈ ఉదయం అమరత్వానికే కాదు విజయసంకల్పానికీ ప్రతిజ్ఞ తీసుకున్న ఈరోజు డిసెంబర్ 2 ఉదయం సందర్భంగా ఒక యువకవి దీర్ఘకవిత 'డిసెంబర్ 2' ఒకసారి మనసులో రీలుగా తిరిగింది. ఏదో పులకరింతగా, జలదరింపుగా అన్నిటికన్నా ఒక కర్తవ్య నిర్దేశంగా ఇవ్వాళ రాయక తప్పదనుకున్నాను. ఆయన ఈ కవిత్వం తప్ప తైదల అంజయ్య 'నేపథ్యం' నాకేమీ తెలియదని వినమ్రంగా అంగీకరిస్తూ...

*హనుమకొండ, 2 డిసెంబర్ 2004*

# 'పునాస' - ఒక గాలితరగ

కె. శివారెడ్డి

"One clear stanza can take more weight
than a whole wagon of eleborate prose"
– CZESLAW MILOSZ

"To find home in one sentence, concise, as if hammered in Metal. Not to enchant anybody. Not to earn a lasting name in posterity. An unnamed need for order, for rhythm, for form, which three words are opposed to chaos and nothingness."

– CZESLAW MILOSZ

తైదల అంజయ్య పుస్తకం రాతప్రతి నావద్ద చాలాకాలం నుంచి వుంది. దాని పేరు, 'పునాస.' వరి మొదటి పంటను పునాస అంటారనుకుంటాను. అంజయ్య మొదటి పుస్తకం. రాతప్రతిని బట్టి, పద్యాలకు దిగువ యిచ్చిన తేదీలను బట్టి చూస్తే దరిదాపు పది సంవత్సరాల నుంచి రాస్తున్నట్టు. మంజీర రచయితల సంఘం కొత్త తరానికి చెందినవాడు అంజయ్య. యిప్పుడు నడుస్తున్న కొత్తతరానికి చెందినవాడు.

సాధన చేసే తొలిరోజుల్లో పద్యాలతో మొదలుపెట్టాడు. తను ఉటంకించిన పద్యం -

*ఎద్దులు గాసే వానికి*
*గద్దరుకున్న పవరు కలిగిననాడే*
*గద్దెల నెక్కిన నేతల*
*పెద్దరికము రద్దుయగును పిడుగుల కవితా!*

బహూశ తెలిసో తెలియకో కవితాయాత్రలో తన ఆకాంక్షని, లక్ష్యాన్ని తెలియజేసింది కవిత. తరవాత్తరవాత, వచన కవిత్వంలోకి దిగటం, నందిని సిధారెడ్డి గురుత్వం దొరకటం - లక్ష్యానికి తగిన దారి దొరికింది.

అనేక సందర్భాల మధ్య, అల్లకల్లోలాల మధ్య ఊగిసలాటల మధ్య, వ్యాపార ఆధిపత్య సంస్కృతుల మధ్య కవిత్వం రాస్తున్న కొత్త కవికి - శంకించబడని ఒక మార్గం దొరకటం, ఎన్నుకోవటం, ప్రవేశించి నిర్భయంగా ప్రయాణించటం మామూలు విషయం కాదు.

అంజయ్యకీ, ఒక ప్రాంతం వుంది, ఒక వర్గం వుంది, ఒక కులం వుంది - వీటన్నిటి వల్ల సంక్రమించిన ఒక సంస్కారం వుంది. చదువు, ఉద్యోగం, భద్ర జీవితం కలిగించే ఒక



సౌఖ్య కాంక్షకి, పట్టనితనానికి బలికాకుండా నిలబడటం, నెగ్గుకురావటం, మూలాల్నుంచి వస్తువును తెచ్చుకోవటం, చుట్టూ వున్న సందర్భానికి అన్వయించి, కవిత్వం చేయటం మామూలు విషయం కాదు. దారి తప్పకుండా తనేమిటో, తన బాధ్యతేమిటో, ఎల్లప్పుడూ గుర్తుపెట్టుకుని అన్నింటినీ విశ్లేషించుకుంటూ కవిత్వంలో ఒదిగించుకుపోతున్నాడు.

ఆధునికాంతర, లేదు ఆధునికోత్తర తరం యిప్పుడు నడుస్తుందా? తత్సంబంధీకులయిన కొందరు కవుల్లో కనపడే నైరాశ్యం, ఆత్మ విధ్వంసనం, తాత్వికపరమయిన బోలుతనం అంజయ్యలో కనపడవు. అన్నింటిపట్లా స్పష్టత వుంది. 'ఏది ఎందుకు ఇలా వుంది,' వెనక చోదకశక్తులేమిటి - strings ఎవరి చేతుల్లో వున్నాయి. తెలుసుకునే క్రమంలో కవిత్వం రాస్తూ పోతున్నాడు. నిర్దిష్టమౌతూ, ఆ వస్తువు నుంచి ఒక సారాంశాన్ని చేదుకుంటానికి ప్రయత్నిస్తున్నాడు.

సిధారెడ్డిని గురించి చెబుతూ, "ఆయన నా గాడ్‌ఫాదర్. ఆయన నన్ను మంజీరలో ఒక పాయగా చేర్చుకొని ఉండకపోతే ఖచ్చితంగా నేను కవిని కాకపోదును, మనిషితనం బతుకు మీద ప్రేమను తెలిసిన మనిషిని కాకపోయేవాణ్ణి," అన్నాడు. యిది అంజయ్య కవితా మానిఫెస్టోలో సారభూతమయిన అంశం.

*కరువుకు*
*మనుషులను అమ్ముకున్నప్పటి*
*ఆకలిచావు మా తాత*
*అప్పులను తీర్చుటకు*
*కడుపుగట్టుకున్న*
*వలసబతుకు మా అయ్య*
*చినిగిన అంగీ లాగుతో*
*బడిలో చేసే జండావందనం నేను*

అని మూడు తరాల కష్టాన్ని, వేదననీ, దుఃఖాన్ని, అణగారిపోవటాన్ని కవిత్వీకరించాడు.

*నాకు మొదటి రక్షక తంత్రం*
*నువు నేర్పిన పాము మంత్రం*
*నిలువు విషపు మనిషి మీద*
*పనిచేస్తలేదే అయ్యా*

అని ఆక్రోశించాడు - *తొలి ఉపాధ్యాయుడు* అనే కవితలో. అదే కవితలో యింకో మాట కూడా చెప్పుకున్నాడు.

*నను బతుకుబాటలో నడిపినందుకు*
*నను రూపాయి వేటగాణ్ణి చేయనందుకు ధన్యుణ్ణి*

తండ్రి నుంచి తను పొందిన వారసత్వానికి, దాన్నెట్లా పరివ్యాప్తం చేయాలి - బతికించేందుకే తను కవితా మార్గం ఎన్నుకున్నాడు.

*అతడు లేని ఆ మొక్కజొన్న చేను*
*చంటిబిడ్డల్ని చంక నెత్తుకుని*
*శవయాత్రలో పాల్గొన్న*
*బాలింతల సమూహం వలె వుంది*

తండ్రి పోయాక ఏర్పడే ఒక శూన్యాన్ని, దిక్కుతెలియనితనాన్ని బొమ్మ గట్టటానికి తను ఎన్నుకున్న ఇమేజ్ పైది.

*అమ్మ ఏడుపులో*
*చెట్టంత కొడుకునైన నేను*
*బురద నాగలి దున్నుతుంటే*
*అంబటాళ్ళ కానుగుచెట్టు నీడ*
*అతడికి రావాల్సిన చద్దులు*
*నా కోసం వస్తాయి*

ఒక విషాద సన్నివేశం, ఒక వెలితిని ఎలా రూపుకట్టాడో చూడండి.

*మనిషంత ఖాళీతనం మధ్య*
*విడిపోయిన జీవసంబంధాల మధ్య*
*కడివెడు శోకాన్ని కొంగున గట్టుకుని*
*అమ్మ పొలంగట్టు మీంచి నడిచి వెడుతుంది*

తండ్రి లేనితనాన్ని ఎలా వ్యక్తీకరించాలి. దృశ్యమానం చేయాలి.

ప్రతి భావాన్ని ఒక పదబంధంలోనో, ఒక మెటఫర్‌లోనో, ఒక ఇమేజ్‌లోనో వ్యక్తీకరించే తత్త్వం అంజయ్య కవిత్వానికుంది. కవిత్వం దృశ్యమానమయినప్పుడు శక్తిమంతమవుతుంది. ముద్ర వేస్తుంది.

*చిత్రంగా కలలో కూడా*
*నేను కాలాన్ని తలకు చుట్టుకుని*
*ఆకలితో తలపడతాను*
*దుఃఖాన్ని జయించే నిరంతర శిక్షణ పొందుతాను*

"An un named need for order, for rhythm, for form," అని మిలోజ్ అన్న మాటల అర్థం యిదేనేమో!

Chaos మీదా, Nothingness మీద విజయం సాధించటానికి నిజజీవితంలోనూ, సామాజిక జీవితంలోనూ, కవిత్వంలోనూ ఈ త్రిగుణాలు అవసరమేమో-

అంజయ్య కవిత్వమంతటా, ఈ ఆర్డర్, ఈ form, ఈ rhythm కోసం ఆరాటపడటమే కాదు, దాన్ని ప్రాణ చలనసూత్రం చేయాలనే కోరికా వుంది.

వస్తువేదయినా తండ్రి పోవటం కావచ్చు, తల్లి పోవటం కావచ్చు, గుడిసె తగలబడటం కావచ్చు - ప్రపంచీకరణ నేపథ్యంలో పల్లెలు వల్లకాళ్ళు అవటం కావచ్చు - అంతస్సారంగా



ఒన నియతి కోసం, ఒక క్రమశిక్షణ కోసం, అందులోంచి జనించే ఒక కళారూపావిర్భావం ముఖ్యమౌతుంది. దాని కోసం ఆరాటం కనపడుతుంది!

*మా వూరంటే బాకీల బాధలకు*
*పెద్దకొడుకును బొంబాయికి తోలి*
*చిన్నకొడుకును జీతముంచే*
*ముసలి బతుకు కాదిప్పుడు -*
*అరెస్టయిన కొడుకులు*
*ఏమవుతారోనన్న శోకగీతం*

*మా వూరంటే*
*రామచిలుక జోస్యం చెప్పించుకోవడాలు*
*కోయదొరలతో చేయి చూపించుకొనుడూ కాదిప్పుడు*
*ఎవరి భవిష్యత్తు ఏమిటో తెలియని అయోమయం*
*ఏ చేయి ఏం చేస్తుందోనన్న అనుమానం*

ముక్తాయింపుగా -

*మా వూరయినా, ఏ వూరయినా*
*కష్టాలన్నీ అట్లనే వున్నయ్*
*కాకపోతే ఆధునీకరించబడ్డాయి*

మూలాల్ని మర్చిపోకపోవటం అంటే గతం జారిపోయినందుకు దుఃఖం కాదు. గతం పట్ల దిగులు కాదు. గతం బంగారుగని అన్న నాస్టాల్జియా కాదు. విశ్లేషణే - 'a source of inspiration,' గతాన్ని తిరగదోడదామనే ఊహ కాదు.

*నేననుభవించిన మట్టిబతుకు నుంచి*
*నేనాడుకున్న గోగుపూల రంగుల నుంచి*
*నా రేపటి కలలు రూపుదిద్దుకుంటాయి*
*దొడ్డికాడ దొర తీయించిన బస్కీలు*
*అడుక్కొని తొడుక్కున్న అంగీలు*
*నలిగే ఎండుటాకుల చప్పుళ్ళు*
*నేను రాసుకునే రాతలవుతయ్*

ఎక్కడో విన్న పాట learn to be lonely అని. పాట మొత్తం గుర్తు లేదు. ఒంటరిగా ఉండటం నేర్వటమేమిటి? అంజయ్య చూడండి.

*ఏ బాధయినా, ఏ బతుకులోనయినా*
*ఒక ఒంటరితనం తర్వాతే తెలిసేది*
*ఏ తెగింపయినా, ఎదురీతయినా*
*ఒక సంక్షోభం తర్వాతే పైకెగసేది*

ఒక దుర్మార్గపు హింసాపూరిత సామాజిక రాజకీయ సందర్భం మనిషినేం చేస్తుంది. విరగ్గొడుతుంది. ముక్కలు ముక్కలు చేస్తుంది. నిస్సహాయుణ్ణి చేస్తుంది, ఒక సమూహం నుంచి తన్ను విడగొట్టి ఒక భీతిలో తొక్కేస్తుంది. వ్యక్తి అవ్యక్తి అవుతాడు. బహూశ ఏకాకి అయిపోతాడు. అన్ని అనుభవాలు, అందరి అనుభవాలు, తన అనుభవాలు దూరమై, విడిపోతాయి. ఒక నిర్వీర్యమయిన ఒంటరితనం నుంచి ఒక resilient powerతో ఎగబాకటం, ఎదురుతిరగటం, వేళ్ళు తెగని వాడికే సాధ్యం. బహూశ అంజయ్య అదే ధ్వనిస్తున్నాడు పై వాక్యాల్లో. చూడండి -

*పుట్టుక గాయమయినప్పుడు*
*కవిత్వం క్షతగాత్రసంగీతం*

*రెండు విలువల మధ్య, రెండు నమ్మకాల మధ్య*
*ఇవ్వాళ ఒక కరెన్సీ ప్రయాణం*
*అవసరాల చుట్టూ పరిభ్రమణ*
*అంతా యినుపవాసన*
*ఒక అమాయనవీయ సందర్భం -*
*కారణాలు, జాతీయ అంతర్జాతీయాలు -*
*ఇప్పుడు చెప్పు*
*నీకు యినుము కావల్నో, మట్టి కావల్నో -*
*మట్టిపొరలే నీ పౌరుషాన్ని రగిల్చేది*
*మట్టిని శ్వాసిస్తేనే*
*నీవు దిగంతాలకు విస్తరించేది*

*విచ్ఛిన్నానికీ, వికాసానికీ తేడా వుంది*
*ఒకడి శ్రమను మరొకడు దోచినంతకాలం*
*మనిషి విచ్ఛిన్నమౌతూనే వుంటాడు*
*ఒకడికోసం ఒకడు విశాలమయినప్పుడు*
*మనిషి వికసించే మందారమౌతాడు*

అంజయ్యకు తనేమిటో, తన నేపథ్యమేమిటో, తన ప్రాంతమేమిటో, వెనుకబాటుతనమేమిటో, వ్యక్తి వెనుకబాటుతనానికీ, ప్రాంతపు వెనకబాటుతనానికీ; కులం వెనుకబాటుతనానికీ మధ్య వున్న అంతస్సంబంధం తెలుసు, గతితార్కిక సంబంధం తెలుసు. అందుకే అంత స్పష్టత. అన్ని వాదాల సత్యాల్ని స్వీకరిస్తూ, తను విస్తరిస్తూ ముందుకెడుతున్నాడు.

ఒక సామ్రాజ్యవాద సాంస్కృతిక దాడి జరుగుతున్న సందర్భంలో, వ్యవస్థలోనూ, వ్యక్తుల్లోనూ వస్తున్న మార్పును పసిగట్టి -

*ఆప్యాయంగా నవ్వినట్టున్న చిరునవ్వే*
*నా వెనుక విషపుకోరై కాచుకుంటుంది*
*ఇప్పుడు విశ్వాసం ధ్వంసమవటం హింసే*



*మనిషి విచ్ఛిన్నమవ్వటమూ హింసే*

*రాజ్యమే వ్యాపారమయినపుడు*
*మనిషి స్థానంలో రూపాయి నిలబడుతుంది*

*ఎవరి యెదుట నిలబడ్డా, ఏదో కమురు సెగ*
*ఎందుకో మనిషి లోపల కాలుతున్న వాసన*

ఈ పదేళ్ళలో జాతీయంగా, అంతర్జాతీయంగా జరిగిన ఘటనలకీ, వచ్చిన మార్పులకీ తను స్పందించాడు. వేదన పడ్డాడు. అంతర్నిహితం చేసుకుని కవిత్వంగా పలకటానికి ప్రయత్నించాడు. మనిషి తన్ను తాను నిర్మించుకోవటం ఒక ప్రాసెస్, ఒక గతిక్రమం. కవిత్వ నిర్మాణమూ ఒక dialectical process. చాలా స్పృహతో, మెలకువతో చేసే పని. అలసత్వం కానీ, వళ్ళు కాకపోవటం కానీ, దగ్గరదోవలు వెతుక్కోవటం కానీ ఉండకూడదు. తొందరగా వచ్చింది తొందరగా మాసిపోతుందని - ఇది నాలుగురోడ్ల కూడలి కాదు. వేలవేలుగా చీలిపోతున్న ఒక జంక్షన్, ఒక కూడలి. మార్గం ఎన్నుకోవటమూ కష్టమే. ఎన్నుకొని తాత్కాలిక ఆకర్షణలకు లొంగకుండా ముందుకు సాగటమూ కష్టమే. యిప్పటి కవికిదొక సవాలు. ఖచ్చిత మయిన రాజకీయ దృక్పథం ఎంత అవసరమో, దాన్ని అంతర్భూతం చేసి, కళారూపంలో వ్యక్తీకరించటమూ మామూలు విషయం కాదు. నిత్యశోధన, నిత్య అధ్యయనం, తులనాత్మకంగా అన్నీ చూసుకోవటం, తూచుకోవటం ముఖ్యం.

ఒక మంచి కవికి కావాల్సిన అన్ని ప్రాథమిక లక్షణాలు అంజయ్యలో వున్నాయి. వనరులున్నాయి. ఇకముందు తను ఎలా పరిణామం చెందుతాడు, వికాసం చెందుతాడు అనేది అతని కృషి మీద, అధ్యయనం మీద, రిజిడ్ కాకపోవడం మీదా ఆధారపడి వుంటుంది.

అంజయ్య చెప్పుకున్నట్టు -

*నిలివెడు చీకటి తెరమీద*
*వెలుగు కిరణాన్ని చేతబట్టి*
*అతడొక ముగింపు లేని*
*యుద్ధ వాక్యాన్ని రాస్తూ వుంటాడు*

ముగింపులేని యుద్ధవాక్యానికిది నాంది.

జీవితమంత మహా యుద్ధవాక్యాన్ని, కావ్యాన్ని రాయాలని అంజయ్యని కోరుతున్నాను, రాస్తాడని ఆశపడుతున్నాను.

నా అనంతమయిన ఆలస్యాన్ని, అలసత్వాన్ని చిరునవ్వుతో భరించిన అంజయ్యకి అభినందనలు.

కొత్తతరం కవుల్లో, ముఖ్యంగా మంజీర కవుల్లో అంజయ్యకి ఉజ్జ్వల భవిష్యత్తునాశిస్తూ...

*12 డిసెంబర్, 2005*

## ఇవీ కవితలు...







# తొలి ఉపాధ్యాయుడు

బౌయి దరి మీంచి నను నీళ్ళలోకి విసిరి
నా మొల్దారం పట్టుకొని ఈత నేర్పిన గురువు
ఇంటి అరుగుమీద అతని వీపు మీద వాలి
మెడ చుట్టూ చేతులు చుట్టిన యాది
సిలుక్కొయ్యకు వేలాడుతున్న
యాతం బొక్కెన నిండా నీటికలలే!
నాకు మోదుగుదొప్ప నిండా బలుసుకు పండ్ల తీపినిచ్చి

వరిమొలకలకు దోసిళ్ళతో నీళ్ళు తాపిన
ఆ విశాలమైన చేతులేవి?
మొరంగడ్డ మీది చొప్పగూడు నుంచి
ఎటువాయె నా గోగుపూల రాగాలు?

❉

నియ్యతి నీళ్ళల్లేసినా వోదన్నవు
మనలను యింటి నుంచి తరిమిన బాకీలను
మట్టిపనితో ఎదిరించినవు తండ్రీ
అప్పులతో నీ చేతులు కాయలుగాసె
నీ పక్కకు నను కూర్చుండబెట్టుకొని
బొంబాయికి వోయిన అన్నకు
మొదట నువు చెప్పిన ఉత్తరంలోని అక్షరాలు
ఇంకా నా చుట్టు తిరుగుతున్నాయి
జీవాల వెంట నువు నాకు పరిచయం చేసిన
'మద్దికుంట' 'మునుల సెలిమె'
'దోమల గట్టు' 'దొంగబండ'
'పాయిరాల కంచె'లు నిను పలవరిస్తున్నాయి

ఆదివారం అమాసనాడు
కరకర పొద్దు వొడిసే యాళ్ళ
నాకు మొదటి రక్షక తంత్రం
నువు నేర్పిన పాము మంత్రం
నిలువు విషపు మనిషి మీద
పనిజేస్తలేదే అయ్యా

నువు జెప్పిన రజాకార్ల కథలు
నను మంటల ఊయలలూపినయి
కోడిగూసిన జాము కుంపటి ముందు



నీ ఒంటరి దుఃఖాన్ని
నేను గమనించేవాన్ని తండ్రీ
ఎన్నీల గానేటపుడు నీ 'కైత్కాల' కోసం
ఎంతమంది మన వాకిలి నిండా!
నీ బాధలన్నీ ఎక్కడవోయేవి తండ్రీ

ఎందరికో రోగమై వచ్చిన చావును
చెట్ల మందులతో చావగొట్టినవు
చావు మంచం మీద అవ్వతో
చివరిగా నను గుర్తుచేసి
ఏ సంజీవనీ మూలికను
వెదుక్కుంట వెళ్ళినావో!

❉

నను బతుకుబాటలో నడిపినందుకు
నను రూపాయి వేటగాన్ని చేయనందుకు·ధన్యున్ని

ఎదురుగా నేను నడిచి వచ్చిన యాళ్ళ
అతడు తినే మట్టిచిప్ప ముందు
మనిషి నిలివెడు ఖాళీస్థలం
మంచిని బతికించాలనే
అతని ఆశల వెంట
చిటికెన వేలు పట్టుకొని
నేను నడుస్తున్న స్పృహ!

3.5.2004



# ఇండియన్ హెరిటేజ్!

కరువుకు
మనుషులను అమ్ముకున్నప్పటి
ఆకలిచావు మా తాత

అప్పులను తీర్చుటకు
కడుపు గట్టుకున్న
వలసబతుకు మా అయ్య

చినిగిన అంగీలాగుతో
బడిలో చేసే జండావందనం నేను

15.12.1993





# అమ్మకల

అమ్మ ఏడుస్తూ నడిచే బాటలో
గోరింకలు ఆగి చూస్తాయి
తింటున్న జామపండ్లను
చిలకమ్మలు విడిచి పెడతాయి
అక్కడి తుమ్మచెట్లల్లో
ఒక ఇల్లంత జీవితం దగ్ధమైన బూడిదలోంచి అతడు
నిద్రలోంచి లేచినట్లు నడిచి వస్తాడు
అతడు లేని ఆనాటి సాయంత్రపు ఆకాశం
దున్ని అలసిపోయిన
ఎర్రమట్టి నాగటిచాళ్లలె వుంటుంది
అతడు లేని ఆ మొక్కజొన్న చేను
చంటిబిడ్డల్ని చంకకెత్తుకుని
శవయాత్రలో పాల్గొన్న
బాలింతల సమూహం వలె వుంటుంది
ఆ యింటిలోంచి లేచిన పొగ
అతడి రూపాన్నే తలపిస్తుంది.

అమ్మ ఏడుపులో
తనను పోషించే చేతులు
మట్టిలో కలిసినందుకు

పొలం ముఖం బీటలు వారుతుంది.
అతడు గొంగడి ముసుగేసుకుని కిర్రుచెప్పులు తొడిగి
పొలం చూడ బయలుదేరతాడు.
అమ్మ కళ్ళలో అతడు
నన్ను భుజాల మీదెక్కించుకుని ఆడిస్తాడు
కొత్త పలక తెచ్చి బడికి తోలిస్తాడు.
అతడి ముందు నేనాడుకుంటూ
నా బంతిని ఎక్కడో పోగొట్టుకుంటాను.

నేనేడ్చిన రాత్రుల్లో వెన్నెలను నా వెంట రమ్మని
నాకు పాలబువ్వ తినిపిస్తాడు.
అమాస చీకట్లలో
ఆమెను భయం ఆవహించినపుడల్లా
అతడు ఒక చేతిలో దివిటీ
మరొకచేతిలో 'వారుగట్టె'తో కనిపిస్తాడు.

అమ్మ కనులలో అతడు
పండుగలకు తయారై వస్తాడు
ఆమె దుఃఖంలో అతడు
జాతర బండి కట్టి వేగంగా
ఉరికించిన చప్పుడు వినిపిస్తుంది.

జాతరలో నాకు బొమ్మకారు,
రంగుటద్దాలు, చిన్న గడియారం కొనిస్తాడు.
అతడు మాకు కొత్తబట్టలు కుట్టిస్తాడు.
అమ్మ ఏడుపులో
చెట్టంత కొడుకునై నేను
బురద నాగలి దున్నుతుంటే
అంబటాళ్ళ కానుగుచెట్టు నీడ
అతడికి రావాల్సిన చద్దులు
నాకోసం వస్తాయి.

25.12.1994





# దుఃఖిత చలనం

మనిషంత ఖాళీతనం మధ్య
విడిపోయిన జీవ సంబంధాల మధ్య
కడివెడు శోకాన్ని కొంగున గట్టుకుని
అమ్మ పొలం గట్టు మీంచి నడిచి వెళుతుంది
నాణాల చక్రాల మీద కరెన్సీ నోట్లు కదులుతున్న
కంప్యూటర్ సన్నివేశంలో పొగచూరిన జీవితచిత్రాల్లోంచి

అవిచ్ఛిన్నంగా సాగిపోయే ఆకలిని వెంటాడుతూ
నేను పరుగెత్తుతాను.
కలుపు తీస్తున్నపుడో, ఇంటి వాకిలూడ్చినపుడో
అమ్మ కన్నీటి చూపులో
దుఃఖమూ, ఆకలీ ఏకమై ప్రవహించే
రెండు జీవనదుల్ని నా భుజాల కెత్తుకుంటాను.
చిత్రంగా కలలో కూడా నేను కాలాన్ని తలకు చుట్టుకుని
ఆకలితో తలపడతాను
దుఃఖాన్ని జయించే నిరంతర శిక్షణ పొందుతాను.

అవ్వా నేనిక్కడ క్షేమమే! కొడుకెట్లున్నడో అనుకోవద్దు
నీ ముందు యుద్ధరంగంలో సైనికుడిలా పొలం దున్నే
పదేళ్ల జీతగానిలో నేనున్నాను
అపురూపంగా నను వీపుకెత్తుకుని పొలాల్లో కళ్లాలూడ్చిన
నీ కలలు సాక్షాత్కరించేటందుకు
పొయి ముందు నువు వలపోసే
'ఎత'కు సమాధానం వెదికేటందుకు

ఎన్నెలను చూపి, నా ఆకలి ఏడుపునాపి
నా చూపును అనంతాలకు మరల్చిన నీ పాటకు
ఆకాశమంత రూపు కట్టుటకూ,
ఎక్కడ విలువలు పతనమవుతున్నాయో
ఎక్కడ మానవ సంబంధాలు నిర్జీవమైపోతున్నాయో అక్కడిదాకా
నిశ్శబ్దపు చీకట్లో చుట్టూ పాతి వున్న ఖడ్గాల్లోంచి,
దుఃఖపు సముద్రంలో నిలబడి విలపిస్తున్న
మాతృమూర్తుల శోకాన్ని పూరించే
పదునెక్కిన నదినై ప్రవహిస్తాను.

3.12.1996





# మా వూరు

మా వూరంటే
వేపచెట్టు కింద గుడిసె ముందు
చెప్పులు కుట్టుకుంటూ ముసలయ్య పాడే
భాగోతపు పాట కాదిపుడు

ఉన్న కులవృత్తీ ఊడిపోయి
రెక్కల కష్టాన్నే నమ్ముకుని
కానరాని దేశాలు పోయే కడుపుకోత

మా వూరంటే
పోరగాండ్లు తాటిమట్టలకు
ముంజకాయల గీరెలు చేసి,
ఆడుకునే బండాట కాదిపుడు
ముంజకాయ బాల్, తాటిమట్ట బ్యాట్‌లతో
దెబ్బలు తినే క్రికెట్ ఆట.

మా వూరంటే
సోడు నూకల కోసం పటేండ్ల యిండ్లల్ల
రోజంతా వడ్లు దంచిన రోకండ్ల చప్పుడు కాదిపుడు
రేషన్ బియ్యం కోసం ఇచ్చినంత కైకిలికెల్లి
కాలమెల్లదీసే కరువుపాటు

మా వూరంటే
వెన్నెల వాకిళ్ళలో కూచుని
చప్పట్లేసుకుంటూ పాడే బతుకుపాటలు కాదిపుడు
కృత్రిమత్వాన్ని పూసుకొని వినిపించే
టేప్ రికార్డర్ పాట

మా వూరంటే
చావడికాడ ఏషాలేసి ఆడే సిందోళ్ల ఆట కాదిపుడు
దొరవారి గడీల
రూపాయి టికెట్‌కు చూపించే సినిమా ఆట

మా వూరంటే బాకీల బాధకు
పెద్దకొడుకును బొంబాయికి తోలి
చిన్నకొడుకును జీతముంచే



ముసలి బతుకులు కాదిపుడు,
అరెస్టయిన కొడుకులు
ఏమవుతారోనన్న శోకగీతం

మా వూరంటే
మూలసుక్క పొడిచినప్పటి
మోటల గిరుకల చప్పుడు కాదిపుడు,
మబ్బుల మోటర్ పెట్టి
కరెంట్ షాక్‌కు చచ్చిన జీతగాడి చావు

మా వూరంటే
రామచిలుక జోస్యం చెప్పించుకోవడాలు
కోయదొరలతో చేయి చూపించుకునుడూ కాదిపుడు,
ఎవరి భవిష్యత్తు ఏమిటో తెలియని అయోమయం
ఏ చేయి ఏం చేస్తుందోనన్న అనుమానం

మా వూరంటే పసులకాడి పిల్లలూగే
ఊరవతలి మర్రిచెట్టు ఊడల ఊయల కాదిపుడు,
అప్పుల బాధలకు ఉరిపోసుకొని
వేలాడుతున్న అభాగ్యుని శవం

మా వూరంటే
దీపావళి పటాకలు, చిచ్చుబుడ్లూ కాదిప్పుడు
తూర్పు చెరువుగట్టు మీంచి సాగిపోయే
బతుకుచిచ్చు నార్పే మోదుగు కాగడాల జాతర
మా వూరైనా ఏ వూరైనా
కష్టాలన్నీ అట్లనే వున్నయ్!
కాకపోతే ఆధునీకరించబడ్డయి.

*23.11.1993, 'సంతకాలు'*



# మా గుడిసె

మా గుడిసె కాలినపుడు
ఇంట్ల పీనుగెల్లినంత బాధయింది
ఎన్ని జ్ఞాపకాలు మంట్లె గల్సిపాయె!



రేపటి కలల కోసం నేను
అగ్గిపెట్టెలో పావులపైసల బిళ్ళలు దాచుకున్నది ఆ గుడిసెలోనే
జాతరలో కొనుక్కున్న పిల్లనగొయ్యను
ఊదుకుంట నేనాడుకున్నది ఆ గుడిసెలోనే
పండుగలకే తొడుక్కునే
నా బొమ్మల అంగీ కాలిపోయిందీ ఆ గుడిసెలోనే
కాలిపోయిన కొయ్య గంగెద్దు బొమ్మ
నా గుండెలో ఇంకా ఆడుతనే వున్నది.

గుడిసె కాలినపుడు మా అవ్వకు
కడుపుగాలినంత దుఃఖం
చెట్టంత కొడుకు చెట్లల్ల గల్సిపాయెనని
ఉన్నోళ్ళ మీద ఏడ్వలేక
పోయినోళ్ళను తల్సుకుని ఏడ్చింది.

మా అయ్యకు తోడేలు మేకపిల్ల నెత్తుకపోయినంత బాధ
గుట్టల్లో గుర్తు తెలియని శవం కన్పించినంత దుఃఖం
మా గుడిసె కాలినపుడే అన్ని కాలిపోయినయ్!
పావులాలు దాచుకున్న అగ్గిపెట్టె
జాతరలో కొనుక్కున్న పిల్లనగొయ్య
పండుగలకే తొడుక్కున్న బొమ్మల అంగీ
నేనాడుకున్న బొమ్మ గంగెద్దూ
ఇవన్ని కాలిపోయి
ఇంకా నన్ను వెంటాడుతనే వున్నయ్
కలమూ, కాగితాలను మిగుల్చుకున్నవాన్ని
ఇపుడు నేనేం గావాలె?
గుడిసెలు కాలుతుంటే
చుట్టలు కాల్చుకునే వాళ్ల కోసం
ఇగ గుణపాఠాలు రాస్తూ వుంట

*29.9.1993, ప్రజాసాహితి*



# రాత్రి కలలు

పగటి కలలంటంగని
రాత్రి కలలు మాత్రం నిజమైతయా?
బతుకు మార్చుకునేటందుకు
బతుక నేర్చుకునేటందుకు
బొంబాయికి పోయే మావోళ్ళకు
నేనక్షరాలు నేర్పిన నుండి రాసే వుత్తరాలను
నా కలల కనుగుణంగా రాద్దామంటె
కలిసి రావడమే లేదు.



జీతమెగ్గొట్టి పోయిన కొడుకును
బస్సెక్కించినపుడు
పైలమని చెప్పిన జాగ్రత్తలు
కష్టాలను తలచుకొని
కొంగునడ్డం పెట్టుకొని
గొల్లుమనే తల్లుల దుఃఖాలు
తిండికి కరువైన తిప్పళ్ళు
ఇంకా తీరని బాకీలు
'అన్నకు పంపిన రాఖీ ముట్టిందా' అనే
చెల్లెళ్ళ ప్రశ్నలు
ఎవరన్న రాంగ
చిన్న చెప్పులు పంపుమనే
తమ్ముళ్ళ అర్థింపులు
ఇంకా ఎన్నెన్నో
నేను రాసే ఉత్తరాలవుతాయి.
ఇంకా అవుతున్నాయి.
బతుకు మారడమంటే
రాత్రి నిద్దురలోకి రంగులనాహ్వానించుకుని
కలలు గన్నంత సులభం కాదు
కావాలని కన్నా, అనుకోకుండా కన్నా
కలలు మాత్రం నిజమవుతాయా?
కలలు కనేకంటే
నేను చేయగలిగింది రాయడమైనా
ఉత్తరాలలో నా రాత
రాయబారమవుతున్నందుకయినా
తృప్తి పడతా.

13.10.1993

# నేపథ్యం



నేననుభవించిన మట్టిబతుకు నుంచి
నేనాడుగున్న గోగుపూల రంగుల నుంచి
నా రేపటి కలలు రూపుదిద్దుకుంటయ్
నేను నడిచిన ముండ్ల బాటల్ల పాడుకున్న పాటలన్ని
వెన్నెల వాకిల్లల్ల ఆడిన ఆటలన్ని
నన్ను చంకనెత్తుకున్న మనాదులై నడిచి వస్తయ్

నేను చదివిన మోదుగాకు రేఖలు
గీచిన ఎర్రమట్టి చిత్రాలు
నాకు ఓనమాలు నేర్పిస్తయ్
నేను తిన్న బలుసుకు పండ్లు, సితపలక్కాయలు
తాగిన జాలునీళ్ళు, మేకపాలు
అవ్వ తినిపించే గోరుముద్దలైతయ్
భుజం మీద కూర్చోబెట్టుకుని
పిల్లబాటలన్ని నడిచి
చెలిమె నీళ్ళు తాగించిన అయ్యదోసిళ్ళు
నాకు బతుకు నడకను నేర్పుతయ్
దొడ్డికాడ దొర తీయించిన బస్కీలు
అడుక్కొని తొడుక్కున్న అంగీలు
నలిగే ఎండుటాకుల చప్పుళ్ళు
నేను రాసుకునే రాతలవుతయ్.

27.10.1993





# ఋణపడి వుంటాను

నేను నడిచిన పిల్లబాటకు
దప్పిక తీర్చిన వాగు చెలిమెకు
సేదదీర్చిన చెట్టునీడకు
పచ్చని పంటసేండ్ల మీంచి మట్టి పరిమళాలను నింపుకొని
ఎంటబడే ఎన్నీల పాటకు
నేను జాజిరి పాటనై ఎదురు నిలుస్తాను.

నమ్మకం చెదిరిపోయినపుడు
మనిషితనం దోయబడ్డపుడు
మంటల్నెగరేసే గోగుపూల జాతరకు
కాళ్ళకు నీళ్ళిచ్చి కన్నీరుదీసి
కడుపులో మెతుకయ్యే కన్నతల్లుల ప్రేమకు
పానమోలె జూసుకునే పల్లెతనానికి
నేను కడదాకా ఋణపడి వుంటాను
కడివెడు నెత్తురును సెమటజేసి
కొండంత త్యాగాన్ని పండించే సెమగల్ల పాటుకు
మనిషంత దుఃఖాన్ని మనుండెదాకా మోసే
మట్టంతటి గొప్ప గుణానికి నేను ఋణపడి వుంటాను
చలనశీల జీవనంలో పరోక్షంగా
నను యోధునిగా తీర్చిన నా శత్రువుకు
నేనెప్పుడూ ఋణపడి వుంటాను.

14.3.1999



# జీవ సంబంధం

రోజంతా బతుకు అనుభవాలను మోసి
అలసిపోయి నిద్రిస్తున్నపుడు
నేను ఒంటరినే! నా స్వప్నం ఒంటరిది కాదు!!
ఏ ముళ్లపొదలమాటునో, ఏ బండరాళ్ల మధ్యనో
గాయపడి విలవిల్లాడుతున్నపుడూ
నేను ఒంటరినే! నా గాయం ఒంటరిది కాదు!!



ఎటువైపు నుంచో ఒక ఆయుధం దూసుకొస్తున్నపుడు
నేను పొందే ప్రతీకారచర్యా ఒంటరిదికాదు.
నా స్వప్నం, నా గాయం, నా ప్రతీకారం
నీదాకా చాచనంతవరకే నేను ఒంటరిని
మనమధ్య మసలుతున్న ఈ పొగ ఎక్కడి అంతరం?
ఖాళీతనం, చావు స్పర్శ కాలాన్ని 24 భాగాలుగా ఖండించి
మనలనూ, మన అనుభవాలనూ
అంతరాలుగా కుదిస్తున్నాయి.
నిజానికి మనమధ్య ప్రవహించే రక్త నదే సమూహం

ఇపుడు మనిషి
పొరలు పొరలుగా ప్రవహించే కాలనదిగా చలిస్తున్నాడు
కానీ కావాల్సిందల్లా
మనిషి జీవ ప్రవాహమై కదలడం,
అనుభవాల సముద్రంగా నిలవడం.

*18.10.1996*



# మట్టి పాటలు

ఎంత తడిగా వాళ్ళ పాటలు
మట్టిగుండెల లోతుల్లోంచి వచ్చి నన్ను చేరుకున్నాయి!
పంటచేండ్లను మునుములుగా స్పృశించిన ఆ చేతుల చప్పట్లు
నా గుండె సముద్రం మీద కొత్త అలలను సృష్టిస్తాయి
వాళ్ళు పాటకు చేసే రూపకల్పన చిగురించి, పుష్పించి నిలవడ్డ
గున్న మామిడంత సిత్రంగా వుంటుంది.
నరైంగ చెట్టు కింద అలసి కూర్చున్న నాముందు నుంచి వాళ్ల పాటలు
జాలు చెలిమె నీళ్లంత చల్లగా కదులుతాయి!
చుట్టూ పసుప్పచ్చగా పుష్పించిన తంగేడు చెట్లోలె నిలిచి,
"గుప్ప గుప్ప వోయేటి గుఱ్ఱాలెవరియో వీర గుఱ్ఱాలెవరియో వీర"
అని పాటలో నన్ను నాయకున్ని చేస్తారు
ఆ పాటల నదుల వెంట నేను
బాల్యంలోకి పరుగెత్తి బంతులాట ఆడుకుంటాను
వెన్నెల రాత్రులతో జాజిరాట ఆడుతాను
మేఘాల రథమ్మీద జాబిల్లిని చేరుకుంటాను.
గోగుపూలూ, నీటిరంగులూ కలిసి వర్షించినట్టు
వాళ్ల పాటలు అట్లా కొనసాగుతూనే వుంటాయి.

*(హోళీ పాటలు నన్ను చుట్టుముట్టినపుడు)*

7.3.1996





# ఒక ముగింపు కోసం...

ఎప్పుడూ నన్నొక ఆయుధం
ఏదో ఒక రూపంలో పసిగడుతూనే వుంటుంది.
అంతా కలలో జరిగినట్లు
పచ్చిగా తడిసిన ఒక గోడ అమాంతం నా మీద పడ్డట్టు
కళ్ళకు గంతలు కట్టి
నన్నొక అఖాతంలో ఊయలూపినట్టు
అప్రకటితంగానే ఒక యుద్ధం
నాపై ప్రకటించబడుతుంది.

❄

ఆ ఒక్క దృశ్యం కోసం
నా అనుభవాలు రంగురంగులుగా
అన్ని రంగులూ కలగలిసిన
ఒక ఎండిపోయిన నెత్తుటి రంగుగా మారి

అదే దృశ్యాన్ని రూపుకట్టే ప్రయత్నం చేస్తాయి.
పచ్చిగా ఎప్పుడూ కన్నీటి తడిలేనిదే
బతుకు దాహం తీరదేమో
మనసునిట్లా కన్నీళ్లతో పిండుకుని
ఊరట పొందటమో
తడి గుండెను కష్టాల ముళ్ళపై ఆరెయ్యడమో
తెలియని సందిగ్ధంలో
సరిగ్గా మళ్లీ అదే దృశ్యం...

అస్తమయంలోంచి అతడు
దుమ్ము రేపుకుంటూ జీవాల వెంట తెల్లగా నడిచే తీరు,
నన్ను చిత్రిక పట్టమని
రంగురంగులుగా కరిగిస్తుంది.

నేను పూర్తిగా సమాధి అయిన తర్వాత
నన్నొక పురాతన శిథిలాల తవ్వకాల్లోంచి తీసినట్లు
కొత్త ఊపిరి పోసుకొని అప్పుడే అసంకల్పితంగా నేను
మళ్ళీ పోరాటానికి సన్నద్ధమవుతాను.
ఏ బాధయినా, ఏ బతుకు లోతయినా
ఒక ఒంటరితనం తర్వాతే తెలిసేది.
ఏ తెగింపయినా, ఎదురీతయినా
ఒక సంక్షోభం తర్వాతే పైకెగసేది.
ఎంత కన్నీరయినా, ఎంత అఖాతమైనా
ఎక్కడో ఒకసారి విచ్ఛిన్నమౌతుంది.
సరిగ్గా అప్పుడే నేను ఒక ముగింపు వెదుక్కుంటూ
ప్రయాణానికి సిద్ధమై ఏదో చెప్పడం మరచినట్లు
నైరూప్యంగా అతడు నడిచివెళ్లే
బాట వెంట వెళతాను.

20.2.1996





# క్షతగాత్ర సంగీతం

బతుకును సానబెట్టుటకు కావలసినవన్నీ
కారం మెతుకులతో తిన్నవాన్ని
గాయపడకుండా వుండడం
నాకు సాధ్యం కావడంలేదు
రజాకార్లు నగ్నంగా బతుకమ్మలాడించిన
పాశవికాలను విన్నవాన్ని
కొంగుల్లో కారంపొడి పిడికిళ్లతో

తలుపుచాటుకు సిద్ధంగా వున్న సాహసాలను విన్నవాన్ని
కమ్యూనిస్టులకు ఇంటెనుక అన్నం పెట్టిన
రహస్యాలను విన్నవాన్ని
గాయపడకుండా వుంటానా?
ఏ రాత్రో లేచి తూర్పు ఎరుపెక్కేదాకా
యాతంబోసిన మా అయ్య కష్టాన్ని చూసినవాన్ని
గాయపడకుండా వుండడం నాకేమాత్రం సాధ్యం కావడంలేదు.
కలం పట్టినపుడు గొంతు విప్పాల్సిందే!
నిరంతరం గాయపడాల్సిందే!
పుట్టుక గాయమైనపుడు
కవిత్వం క్షతగాత్ర సంగీతం
ఏడ్చినపుడు వెన్నెలను
నిద్ర లేవంగనే సూర్యున్ని చూసినవాన్ని
గాయాలతో పుట్టినవాన్ని
గాయానికి నేను భయపడడమేమిటి?
నేనెప్పుడూ గాయపడాల్సిన వాన్నే.
గాయాలను పాడేందుకు
నేనెప్పుడూ సిద్ధమే!

*22.12.1993*





## మట్టిశ్వాస

రెండు విలువల మధ్య రెండు నమ్మకాల మధ్య
ఇవాళ ఒక కరెన్సీ ప్రమాణం
భూగోళం మీద యిపుడు లోహమైదానం విస్తరిస్తున్నది.
ఆధునీకరించబడిన కాలం

రూపాయి చూపులను అలవాటు చేస్తున్నది
కలల మెట్ల మీద కంప్యూటర్ డిజిట్లు
పట్టపగలు కుంభకోణాలను రూపొందిస్తాయి.
రేపు కరెన్సీ వాటర్ ప్రింట్ మీద
యంత్రమవుతున్న మనిషి
నీటిపాలైన నీ కష్టాన్ని చూసి, యినుపనవ్వు నవ్వుతాడు.
ఇక మానవ సంబంధాలన్నీ
అవసరాల చుట్టు మాత్రమే పరిభ్రమిస్తాయి.
అంతా యినుపవాసన!
తెగిన రక్త సంబంధంతో నీ గుండె గడ్డకట్టుకుపోతుంది.
బలవంతంగా నువు కనే నెత్తుటి కలలో
నీకు అందకుండా వున్న దారిద్ర్యరేఖకు ఉరేసుకుని వేలాడతావు.
అనంత ఘర్షణల్లోంచి నువు
పదునెక్కిన ఖడ్గమైనపుడు
జీవితమేఘం మెరుపై నవ్వుతుంది
బీటలు వారిన నీ గుండె పొలంలో
మట్టి పిడికిళ్లు మొలుస్తాయి.

ఇప్పుడు చెప్పు,
నీకు యినుము కావాల్నో, మట్టి కావాల్నో
మట్టిపొరలే నీ పౌరుషాన్ని రగిలించేది,
మట్టిని శ్వాసిస్తేనే
నీవు దిగంతాలకు విస్తరించేది!

*20.7.1996, రంజని-కుందుర్తి ప్రశంసాపత్రం*

*ఆంధ్రజ్యోతి వీక్లీ*





# శత్రుస్పృహ

నిశ్శబ్దం పొంచి వుంటుంది
నీడలు భయపెడతాయి
చాపకింద నీటిపాము కదిలినట్లు
నువ్ మేల్కొనక ముందే శత్రువు చాలా రూపాల్లో ఎదురవుతాడు.
ఇపుడు కంప్యూటర్లు అర్థమైనంత సులభంగా సమస్య అర్థంకాదు.
శత్రువు అసలు కనబడడు
అసలును మించిన వడ్డీగానో, ఆకాశాన్నంటే ధరరూపంలోనో
పంటకు పట్టిన చీడగానో నీ వెంటనే తిరిగే కోవర్టుగానో
ఏదో ఒక విధంగా శత్రువాత పడకుండా
నువ్విప్పుడు ఇంటికి చేరలేవు

మంచె మీద నక్షత్రాలు వెలిగించుకొని
గడ్డిపూల ఊయలలూగిన పల్లెలకిపుడు
పాములు చొరబడ్డ ఇంట్లో పల్లేరుగాయల నిద్ర
వాడు నీ తలను ఛానళ్ళకు కట్టేసి
నీ వాకిలిని ప్రొక్లయినర్ చేతులతో పెకలించుకుపోతాడు
ఇంటిగుహలో కూర్చుండి
తగలబడిపోతున్న ప్రపంచాన్ని
నువ్విపుడు ప్రేక్షకునిగా మాత్రమే చూడగలవు.
ఎన్నో చేతులు చేష్టలుడిగి వేలాడడం
చాలాసార్లు గొంతు చేదెక్కడం
రూపాయి ఉరితాడు కావడమూ చూస్తావు
వాడు రోకలిని తలకు చుట్టుకొని
శరీరాన్నుంచి ఆకలిని వేరుచేసి,
మాట్లాడే రొదను వింటూనే వుంటావు.

నీకిది ఎన్నో చావో తెలియదు
ఉట్టి కెక్కకుండానే
వాడు దూరపు కొండల స్వర్గాలను చూపిస్తాడు
శత్రువుకు కలలు ప్రమాదాన్ని సూచిస్తాయి
కాచుకొని ఉండాలి
నమ్మకాల చాటున దాగి
ఎండుటాకుల మీద నీ నడక చప్పుడు వింటాడు
నీవు నలిగిన గడ్డిపోచల మీద
గుర్రపు అడుగులను గుర్తించాలి.
గాలిని వడబోసి పసిగట్ట గలగాలి
ఇప్పుడు శత్రువు రూపాన్ని గుర్తించడం
శత్రువు కదలికల్ని గుర్తించడమే
అసలు యుద్ధం.

8.12.1999





# పునరాగమనం

గ్రహణం పడితే సూర్యుడు అదృశ్యమైండని కాదు.
గమనం మారిందని కదా అర్థం
గొంతును మూసేస్తే గుండె ఎట్లా ఆగిపోతుంది?
స్పందన ఉధృతమై తీరుతుంది.
పరుగెత్తే ప్రవాహాన్ని ముక్కలుగా నరకడం అవివేకం
ఇపుడు పోరాటం అవిచ్ఛిన్నమే కాదు, అనివార్యం కూడా!
నీకున్న ఆయుధబలంతోనే అన్నీ ఆగిపోవు
దమ్ముంటే ఆకలిని ఆపు చూద్దాం!
అడవి చుట్టూ ఎంతసేపు సరిహద్దులు గీస్తావు?
ఎన్ని చెట్లను బంధిస్తావు?
గాలిని బంధించే సత్తా లేకనే కదా!
సహజత్వం ముందు కృత్రిమత్వం
ఆలస్యంగానైనా ఓడిపోక తప్పదు
నీవో, నీ బలగాలో సాయుధంగా
పల్లె పొలిమేరల వెంట సంచరించి చూడు
ఏ వరిచేనులోంచో, జొన్నచేను లోంచో
ధైర్యంగా కొడవళ్లు పట్టుకుని
కూలీలు పాడే పోరాటగీతం వినిపిస్తుంది
ఆ ఒక్క పాట పదును చాలు
నిన్ను పరాజితుడ్ని చేయడానికి

24.8.1996



# స్పర్శించే ధ్వని

ఇవాళ వాళ్లు చీకటి సముద్రం మీద మౌనంగా నడుస్తూ ఉండవచ్చు.
వాళ్ల చూపులు ఉదయించే సూర్యగోళం మీద గురితప్పి ఉండవచ్చు
ఎండిపోయిన రెండు నల్ల కలువలు
ఒక వర్ణ ప్రపంచాన్ని తడుముతూ ఉండవచ్చు.



మనకివాళ రంగులవసరం లేదు
కళ్లు మిరుమిట్లు గొలిపే వెలుతురవసరం లేదు!
నిశ్శబ్దపు లోయలోంచి
గాయాలను పాడుకోగల గొంతులు కావాలి.
కాంతిని అశ్లీలంచేస్తున్న నాగరిక సంస్కృతి మీద
తుప్పున ఉమ్మేసే స్వాభిమానం కావాలి!
ధ్వనిని బూతుగా మారుస్తున్న ద్వంద్వార్థాల మీద
శబ్దభేదిని ప్రయోగించే సాహసం కావాలి!

ఇవాళ మన కళ్లముందే పగలూ, రాత్రుల్ని
పిడికిట బంధించి నడుస్తున్నదెవరు?
చూస్తూ ఊరుకునేవాళ్ల కంటే, వింటూ మాట్లాడని వాళ్లకంటే
శబ్దాన్ని పసిగట్టి, భూమి కాన్వాసు మీద నిలబడి
మట్టి గొంతు లెత్తుతున్నదెవరు?
వాళ్లు మనమంతా చూస్తుండగానే మన అజ్ఞానం ముందు
మన మెరుగని జీవితాన్ని స్పర్శిస్తారు.
దోసిళ్ల నిండా వెలుతురు పిట్టల్ని పట్టుకుని
ఓ కొత్త ఉదయాన్ని ఆవిష్కరిస్తారు.
కాళ్లు కదలకుండా ప్రపంచాన్ని ఇంటర్‌నెట్‌లో చూస్తున్న
మన చరిత్రనంతా రేపు
వాళ్లు కంప్యూటర్ తెరకెక్కిస్తారు.

*11.12.1997, ఆదివారం ఆంధ్రజ్యోతి*



# సహజాతం

ఇక నువ్వూ నేనూ ఎక్కడా కలుసుకోవద్దు.
ఏ ఒక్క విషయంలోనూ ఏకీభవించవద్దు.
విడిపోదాం, విడిపోదాం
వృత్తాలు వృత్తాలుగా, ద్వీపాలు ద్వీపాలుగా
నాలుగు ముఖాల్లేని శరీరాలు
నాలుగు ఇనుపగోడల మధ్య ఒక కుటుంబం
మద్దిమాను మంచె మీద పైడికంటె కూత
తుమ్మల కంచెలో ముళ్లకూ, ముళ్లకూ మధ్య యుద్ధం
దున్నిన దుక్కిలో విత్తనంలో దాక్కున్న విషపుజన్యువు
విరిగిన డప్పు, వెదజల్లబడిన గజ్జెలు
ఖడ్గానికి ఉరి తీయబడిన కోకిల
రెండు ఖండాలుగా నరకబడిన నెమలి కాళ్లు
నాలుగుబజార్ల మధ్య తెగిపడ్డ శిరస్సు
ఛిన్నాభిన్నమైన మట్టిగొంతుల జానపద కచేరీ

❊

ఈ అమాయకపు రాత్రులు చాలాసార్లు
పుత్రశోకంతో దుఃఖించగా విన్నాను
ఏమున్నది పాత దుఃఖమే!
ఈ నిర్భాగ్యపు పగళ్లు ఎన్నోసార్లు
ఆకలితో నకనకలాడడం చూశాను
ఏముందీ? ఆకలీ పాతదే!
లాంగ్ మార్చ్! లాంగ్ మార్చ్!!
అంతా ఫాంటసీ!
గ్లాసుల నిండా చీకటిమత్తును తాగి హాయిగా నిద్రపోకుండా
మనమెందుకిట్లా మేల్కొని వుండటం?
మన శరీరాల్లోకి మనం తాబేళ్లమై ముడుచుకుందాం.
ఈ పిగ్మీ రూపంలో చాలా తేలికగా వుందిప్పుడు
సమూహ స్వప్నాల మీది నుంచి
తలక్రిందులుగా నడిచివచ్చి
మోకరిల్లిన పన్నెండు మృత కళేబరాలు
సమస్యను సజీవంగా వుంచే ఒక లోహముఖం
తుపాకులు పూలను వర్షించాలని చెప్పే అహింసా పాఠం

❊

ఇక్కడ మనం మళ్ళీ విడిపోదాం
వృత్తాలు వృత్తాలుగా ద్వీపాలు ద్వీపాలుగా
ఆకలి, దుఃఖముల వలె నా చూపు పాతదే!
నా గొంతు ఇంకా పాతది
కానీ ఇప్పటి ఆ సన్నివేశమే కొత్త!
అంతరాయమై ఒక అసంకల్పిత
అనివార్య దృశ్యం, పోటెత్తిన ఆదిమ సహజాతం
జనపదాల వాకిళ్ళ ముందు
పిల్లలంతా చేరి జయించుకుంటూ సాగే ఉప్పొంగి!

*21.7.1999*



# మృత్యు పరాజయం

నిలువెత్తు గాయాలను భుజానికెత్తుకుని
తీరని జనం ఆకలిని నడుముకు చుట్టుకుని
రూపొందే పాటవై, సిద్ధమయ్యే వ్యూహమువై
రెండు కళ్లలో నాలుగు యుద్ధ సన్నివేశాలతో నువు నడిచివస్తావు
కన్నీళ్లకు ఆలోచనవై, అనంత ప్రశ్నా సమూహానివై వస్తావు
పల్లె యువకులు జట్లుజట్లుగా శివమెత్తిన నీ పాట
అగ్నిగుండాల చుట్టూ దూలా ఆడుతున్నది.
నీ పాట గుడిసెల చూరుల్లోంచి గురి కాచి చూస్తున్నది.
మట్టికి పరిమళాన్ని పంచుటకు
మొక్కకు మాట నేర్పుటకు
మృత్యువులోనూ నేలతల్లిని
ముద్దాడే సంకల్పాన్నిచ్చుటకు
నువు కెరటమై వస్తావు
తెలిసీ తేనెతుట్టను కదిలించినాడు వాడు
తెలంగాణా పాట ముందు వాడొక మరుగుజ్జు
నిశ్శబ్దంలో నాలుగు బుల్లెట్లు ధ్వనించడం కాదు
నీ పాట ఎనిమిద దిక్కులై ప్రతిధ్వనిస్తుంది.
నీది సముద్రభాష
నీదీ మహా స్వప్నం
నీవు రేపటి ప్రజాయుద్ధం

6.4.1997





# కవులున్నారు జాగ్రత్త

చినిగిన అంగీలల్ల రాళ్ళేరుకొని
చింతకాయలు రాలగొట్టుకున్నపుడే అనుకున్నం
ఆకలిపోరు తప్పదని
గురి చూసుడు నేర్చుకోవాలని
అనుకున్నం గని ఏమనలేకపోయినం

చీకటిపడేదాకా 'సితపలక్కాయలకు'
తిరిగినపుడే అనుకున్నం
ఆకలిపోరు తప్పదని
అడవి కెళ్లడమూ తప్పదని
అనుకున్నంగని ఏమనలేకపోయినం

అప్పుపత్రం మీద వేలిముద్ర వేయించుకున్నపుడే అనుకున్నం
ఆకలిపోరు తప్పదని

ఇవేవో వందలను వేలుచేసి
మా వేలుతో మా కంట్లో పొడిచే చేటు రాతలని
అనుకున్నం గని ఏమనలేకపోయినం

మీ లెక్క మాకు అనుడు రాదు
చేసుడొక్కడే మాకొచ్చేది
చేసుక బతికెటోళ్లం గద!
మీమీద ఏడ్సుడు గాదుగని
మా శ్రమ మాకు దక్కుతలేదు
ఏం జరిగినా ఏమనలేకపోయినం
ఇపుడేం చేయాలనే చూస్తున్నం
మేమేం చేసినా ఆకలి కోసమే!
కడుపుకింత తిండిబెట్టే పనులేగాని
కడుపులుగొట్టే పనులు గాదు.
మేం చేసిన వేలిముద్రల సంతకాలు
ఎట్లయితేంది మాకింత తిండి నిచ్చినయిగని
మీ దొంగ సంతకాల లెక్క
ఎవరి నోట్లె మన్ను వొయ్యలేదు
స్వతంత్రమంటే మీ స్వసంత్రాన్ని
మా మీద ప్రయోగించుడుగాదు
మాకంతా తెలుస్తున్నది
ఎప్పటికప్పుడు మీ ఆటలను, నాటకాలను
మా బాధలను, మా పౌరుషాలను
మీ భాషలో మీకు, మా రీతిలో మాకు
గొంతులు పెగల్చి చెప్పి
మాకు అండగా నిలిచే
కవులున్నారు జాగ్రత్త!

20.10.1993





# నియంత్రణ

కుట్రను పసిగట్టినందుకే గదా
నీకూ, మాకూ మధ్య దూరం పెరిగింది.
కుతంత్రాన్ని ఎత్తిచూపి, సవాళ్లమై నిలబడినందుకే గదా
మేము నీ టార్గెట్‌గా పరిణమించింది.
ఇవాళ మేం నిశ్శబ్దంగా వుంటే

రేపూ భయంకరమే, రేపటి మా కలలూ భయంకరమే!
ఒరలో వున్నా పిడికిట్లో అమరినా
ఖడ్గం స్వభావం పదునే!
మట్టిని ప్రేమించి నాగలిపట్టినా
మాటకు పదునుపెట్టి గొంతెత్తినా
అరాచకత్వం మీద వెదురువింటిని సంధించినా
నిర్బంధం నాలుగు గోడలైనపుడు
నిలుచున్నచోటే మా రణరంగం
మా నెత్తురు చిందిన నేల
నీ ముఖం మీద మట్టి దోసిళ్లెత్తుతుంది

తూటాలు నాటిన చోట తూణీరాలు మొలుస్తాయి
నేలకొరిగిన మా వెన్నెముకలు
దూసుకొచ్చే వజ్రాయుధాలవుతాయి
ఇక్కడ త్యాగమే కదా శిక్షింపబడింది
గాయపడి వచ్చిన పావురాలకు
ఆశ్రయమిచ్చే అతిథులేమవుతున్నారు?
ప్రపంచపు ఆకలని పంచుకుంటున్న
భూమిపుత్రులేమవుతున్నారు?
జీవన సాఫల్యాలను, దుఃఖపు మూలకారణాలనూ
వెదకబోయిన సిద్ధార్థులంతా
ఎక్కడ అదృశ్యమవుతున్నారు?
మట్టిగుండెల్లో నిక్షిప్తమైన శ్వాసలై, కడసారి చూపులై
జీవితానికి పోరాటాన్ని అన్వయించిన చిరంజీవులై
రేపు చెయ్యాల్సిన యుద్ధ సన్నివేశపు వ్యూహమవుతున్నారు
ఇరవై ఒకటో శతాబ్దపు ముఖచిత్రమవుతున్నారు.

*22.9.1996*





# ఒక ఉపాధ్యాయుని ఆఖరి పాఠం

నిలివెడు చీకటి తెరమీద
వెలుగు కిరణాన్ని చేతబట్టి
అతడొక ముగింపులేని యుద్ధవాక్యాన్ని రాస్తుంటాడు.
తల్లికోడి రెక్కల వెచ్చదనాన్ని కోల్పోయిన పిల్లలతోపాటు

మన తలల నెగళ్ళను ముట్టించి వెళతాడు.
నాలుగు గోడల మధ్య రూపొందే భవితవ్యం ముందు
అతడు నెత్తుటి గతాన్ని చూపుతుంటాడు.
గదిలోపలి మనిషి కనబడడు. చేయి రాస్తూ వుంటుంది.
ప్రపంచం ముందు
మనిషి కనబడతాడు. చేతులు కనబడవు.
నెత్తుటి చేతులు కడుక్కున్న తర్వాతే
అశోకుడు హింస మానుకున్నాడు.
కానీ చేతికి నెత్తురంటకుండా
హింస కొనసాగుతున్నది!
అదే చీకటి తెరమీద
వెళుతూ వెళుతూ అతడు
మనకు 'అదృశ్యహింస'ను చూపిస్తాడు.
ఒక పూర్తి యుద్ధవాక్యాన్నిట్లా రాస్తాడు.

"వీరుని సమాధి
సమాది మీద మొలిచిన గడ్డి
గడ్డి మేసిన ఆవు
ఆవు పాలు తాగిన శిశువు
శిశువు రేపటి యుద్ధవీరుడు"

*6.7.2001*





# మనిషి విచ్ఛిన్నం

బతుకంటే సాఫీగా సాగే ప్రయాణం కాదు
ఒక గమ్యాన్ని వెదికే ఎడారి పరుగు
దేనినో వెదికే ఆయాసమెరగని ఆకలివేట
బతుకంటే అనుభవాలను బతికించే కన్నీటి శ్వాస

వసంతం వూరికే వస్తుందా? ఎన్ని అనుభవాలను రాల్చాలి.
చిగురించే మోదుగుపూవు ఎరుపెక్కి జీవించమంటుంది.
మనిషన్నపుడు పిడికెడు గుండె సరిపోతుందా?
సముద్రమంత హృదయవైశాల్యముండొద్దూ?
బతుకు గాయాలను తడుముకుంటూ
నేను నిద్రలేస్తానో లేదో ఒక నిశీథి నా మీంచి
అమాంతంగా నడిచి వెళ్తుంది
చినిగిన అనుభవాలను ఇట్లా కుట్టుకుంటానో లేదో
ఒక పెను తుఫాను
నా అనుభూతులను కబళించి వేస్తుంది
అందంగా అల్లుకున్న నా స్వప్నసౌధాన్ని
ఒక రాబందు ఢీకొడుతుంది.
మానవతా భావంతో చూడాల్సింది పోయి
నన్నెవడో రూపాయి కళ్ళతో చూస్తున్నాడు.

హృదయం వికసిస్తే మానవత్వం
గుండె వికటిస్తే ఉన్మాదం
ఇక్కడ జీవితానికీ, జీవితానికీ తేడా వుంది
విచ్ఛిన్నానికీ వికాసానికీ తేడా వుంది
ఒకడి శ్రమను మరొకడు దోచినంతకాలం
మనిషి విచ్ఛిన్నమవుతూనే వుంటాడు
ఒకడి కోసం ఒకడు విశాలమైన నాడు
మనిషి వికసించే మందారమవుతాడు.
జీవితమంటే వికసించిన మట్టి
మట్టిని శ్వాసిస్తేనే మనిషి గుండె విస్తరిస్తుంది.

*31.1.1995*





# ఆవర్తనం

ఇప్పటివలె కాకుండా
పునర్బలనం చెందిన శాశ్వతమార్పుతో
నేను మరల తిరిగొస్తాను
పసివాడి నవ్వంత స్వచ్ఛంగా

రెండు దుఃఖాల మధ్య
ఒక జీవితకాలంలో ఒకానొక సందర్భంలో
నేను మరలా తప్పకుండా తిరిగొస్తాను
ఒంటరిగా నువ్వొక దుఃఖిత సన్నివేశమైనపుడు
నువు తెరిచిన కిటికీగుండా వెలుగునదినై ప్రవహిస్తాను
ఒక జ్ఞాపకాన్నై, ఓదార్పుగీతాన్నై వస్తాను
నేను తిరిగి వచ్చేదాకా ఇక్కడనే వుండు
ఇట్లానే వుండు. వుంటావా?
ఖడ్గాన్ని ప్రేమించినదానా
ఒక పాటనై నిన్ను వెంటాడటానికి
మరల తిరిగి వస్తాను నీ నయనాకాశంలో చంద్రకాంతినై
నువు నడిచే పిల్లబాటల వెంట
అక్కడక్కడా వేసిన ముళ్లకంచెల మీద
నీకోసం నక్షత్రాల్నెత్తి పట్టిన పూలతీగనై
నీ చిగురుటాకు చేతుల గోరింటాకు ఆరీ ఆరకముందే
నీ కాటుక కళ్లలో సజల దృశ్యాన్నై
వేయి గ్రీష్మాలను ఈదుకుంటూ
ఒక సమూహస్వప్న ఫలితాన్నై
తెల్లని కాగితం మీద
నువు సంతకం చేసినంత సులభంగా...

*2.3.1999*





# రాతి ముఖాల మీద

ఆకలి సముద్రం మీద అలసి నిద్రిస్తున్నపుడు
నీ చుట్టూ విస్తరిస్తున్న చేతులు
నినదించే పిడికిళ్లు అలలు అలలుగా పోటెత్తుతాయి
ఒంటరిగా సమూహంలో నడుస్తుంటావు.

నీకు పరిచితమైనట్టున్న ముఖాలు, ముఖాల్ని కోల్పోయిన ముఖాలు
ఎండిన చేపల వంటి రెండు నిర్జీవ నేత్రాల మురికినీటి ముఖాలు
చీకటి అఖాతంలోంచి దీనంగా
దుఃఖంగా పైకి చూసే ముఖాలు
బహుశా ఈ ముఖాలన్నీ యుగాల నుంచీ నీకు తెలిసి వున్నవే!

హృదయాలను మేల్కొలిపి నువు దుక్కులు దున్నుతుంటావు
నీ పూర్వీకుల పురాతన అస్థిపంజరాలు మట్టిలో లభ్యమవుతాయి.
ఎవరు వీళ్లంతా?
ఆకలికి అడ్డుకట్టలు వేసి అలసి నిద్రిస్తున్నవాళ్లేనా?
ఎండిన పొలాన్ని చూసిన నీ ముఖం భళ్ళున ముక్కలవుతుంది.
పచ్చని పైరును కౌగలించుకున్న నీ భుజాలు కన్నీటితో తడిసిపోతాయి
మనిషంటే ఇపుడు వేయితలల్ని మొలకెత్తించడం
కోటి ముఖాలుగా విస్తరించడం గదా
నీ నిర్మూలన కోసం నీకు అన్నివైపులా
డేగముఖాలు పొంచి వుంటాయి.
అసహ్యాన్ని పుక్కిటిపట్టి
ఈ రాతిముఖాల మీద ఉమ్మెయ్!

14.3.1999





# వర్షం ఒక చైతన్యం

మట్టినీ
మట్టితోపాటు మనిషినీ మేల్కొలిపే
వర్షం ఒక చైతన్యం
తొలకరిజల్లు కురిసిన తర్వాత
కవాతు చేసే నాగండ్లు ఒక ఉత్సవం
పొలాల్లో నాట్లేస్తూ ఆలపించే
మట్టిగొంతుల ఆలాపన ఒక సౌందర్యం
తీరొక్క పువ్వులతో వాడవాడలా కురిసే
బతుకమ్మలు ఒక తంగేడు పూలవర్షం

ఇండ్లు ధ్వంసమై
ఇంటిదీపాలు అదృశ్యమై
బతుకు ప్రశ్నార్థకమైనపుడు

పల్లెలు -
"కుండలు పలుగుతెవాయెగని
కుక్కల గుణాలు దెల్వుకుంటయ్"

15.6.1998



## Integral '*x*' Zero to Infinity

ఈ యేటి వర్షం కొత్తగా వుందనుకుంటాం, కానీ కాదు
ఇదే వర్షం నిరుడూ వుంది. వచ్చే యేడూ వుంటుంది.
నిన్నటినీ రేపటినీ కలుపుకుని
మనుష్యనిర్మాణం జరుగుతున్నది
ఆకుపచ్చని సముద్రపుటలల్ని
ఈ నేల మరోసారి కలగంటుంది.
తల మునిగిన అప్పులనూ, నీటిని తలుచుకుంటూ
బురద పొలంలో చెమటమనిషి నడుస్తుంటాడు.
'కాలుగ్రు' వడి ఎడ్లు తల్లడిల్లుతయి.
నాగేటిచాళ్ళ పక్కటెముకల మీంచి
కరువురాజ్యం నడిచి వెళుతుంది.
చెరువు నిండే దృశ్యాన్ని చూసే కన్నుల్లో అగ్రిబిజినెస్!



కొత్త వ్యవసాయం 'ఫ్లోరీ' 'ఆక్వా' కల్చరవుతుంది.
పంచె నిండా దుఃఖాన్ని పరుచుకున్న రైతు ముందు
మాయ తెరల మీద గ్లోబల్ త్రిశంకు స్వర్గం
డాలర్ ఎండమావుల వెంట తాబేళ్ళ పరుగు పందెం
సిలికాన్ వ్యాలీలో ఒక కప్పా ఇంకొక కప్పా
ఒకానొక సందర్భంలో కలుసుకుని ఒకే ఒక్క స్వార్థపుమాట;
మా యింటికొస్తే ఏమి తెస్తావు?
మీ యింటికొస్తే ఏమిస్తావు?

❄

తిండి - చేతికీ నోటికీ వున్నంత దూరం కాదు.
అదొక సుదీర్ఘ శ్రమయాత్ర
మనిషి నడిచిన దారుల వెంట
ముళ్ళ పొదలను చీల్చుకొని
ఎన్ని గడ్డిపూల నక్షత్రాలు వెలుగలేదు?

ప్రపంచపు తరగతి గదిలో ఎప్పటికీ
వేలెత్తి ప్రశ్నించడాన్ని
నేర్వడం, నేర్పడమే జరుగుతున్నది.
మరీ మరీ కలలుగనే నేల కనుమసక తెరమీద
జాలువారుతున్న వాగులో
పిల్లలు చెలిమె జల్లుతుంటారు.
దూరాలను కలుపుతూ పక్షుల విడుదల కోసం
రూపాయి పంజరం ముందు
పన్నెండు జతల పాదాల కవాతు
ఈ నేల త్యాగాల మీద
"వడ్లెన్నివండినయంటరుగని
ఎడ్లెన్ని జచ్చినయనరు"

8.10.2000



# నడిచే పాదాలు

తల రుమాలును చంకన పెట్టుకుని
వంగి భూమికి దండంబెట్టి నడిచినపుడు
ఏడుమోటల బావిలో ఎన్నోసార్లు
మోటబొక్కెన ఆత్మహత్య చేసుకుంది.
కానీ కాలువ చచ్చిపోలేదు.
పంటై లేచింది.
అప్పులు మెడచుట్టూ బిగుసుకున్న ఒక అపరాత్రి
పడమటి మర్రిచెట్టుకు చంద్రుడు చాలాసార్లు ఉరేసుకున్నాడు.
కానీ వెలుగు ఆగిపోలేదు. సూర్యరూపమయింది.
చీకట్లు సింహాసనాలై కొరడాలు ఝళిపించినపుడు
ఎన్నో తలలు వంగివంగి సలాములు చేసినయ్
కానీ ఆలోచన ఆగిపోలేదు.
శిరఃసముద్రాల్లో అలలు లేచినయ్
నల్లత్రాచు చీకటి నాలుకను ఖండించే పదునైన పాట
పశువుల కొట్టాల వెంట పంట కాలువల వెంట
బక్కెద్దుల కళ్లలోంచి, పల్లెల నాలుకల మీద
ప్రవహించి, ప్రవహించి అకస్మాత్తుగా విచ్ఛిన్నమవుతుంది.
పాటను వెదుక్కుంటూ వెళ్లిన నాలుగు ముఖాలు



దివిటీల పొగచూరి నిలబడతాయి
నడిరాత్రి కట్టెనానుకుని ముసుగు కునుకు తీస్తున్న
గొర్ల కాపరి చెవిలో తీతువు పిట్ట అరుపు
కత్తిగాటై దిగుతుంది.
పిల్లలనెడబాసి తల్లి గొర్రెలు బావురుమంటాయి.
వేటబాణాలు గుచ్చుకున్న పావురమొకటి
దిగుడుబావిలో తేలుతుంది.
బంగారు అలల రెపరెపల పొలాల మీద
తెలంగాణా పాట రక్తమోడ్చి వెళుతుంది.

"గువ్వా! గువ్వా! నీ గూడెట్ల చెదిరెనే?"
"ప్రాణులన్నింటికీ నీడ కావాలంటె"

"కోకిలా! కోకిలా! గొంతెట్ల తెగెనే?"
"కన్నీటి గాయాల గేయమైనందుకు"

నడిచే పాదాలను తెగనరికి
చివరి చరణం ముగిసిందనుకోవద్దు.
పల్లవి తిరిగి మొదలవుతుంది.
నూతులు గొంతెత్తుతాయి
వెదికీ వెదికీ అలసిన నాలుగు ముఖాలు
ఊరవతలి చూరు కింద
కొత్తపాటను రూపొందిస్తాయి.
నిట్టాడుకు ఊయలూగుతున్న శిశువు
రేపటి ప్రపంచం కోసం నిద్రాతపస్సు చేస్తుంది.
ఎన్ని తలల్ని తప్పదీసినా
ఇంకెన్ని వెలుగునవ్వుల్ని కత్తిరించినా
ఇంకెన్నోసార్లు
కోకిలలెప్పుడూ కాకులగూట్లోనే జన్మిస్తాయి

*(లలిత కోసం)*

9.9.1999



# ఒక విచ్ఛిన్నం

మన మధ్యనున్న రెండు ప్రపంచాలు వేరైనపుడు
వాటిని కలిపే ఏ సంబంధమైనా గొప్పదే
చాలారోజుల తర్వాత ఒకానొక అర్ధరాత్రి వాకిట్లో
నా అలికిడి వినగానే ఆమె గుడ్డిదీపమై ఎదురొస్తుంది.
నిద్దట్లోంచే నా పిల్లలు బంతిపూలై నా మీద వాలతారు.
నా కలలో ఒక ఉదయం పూట
మావూరు కాని వూళ్లో మా అయ్య నా కెదురై
ఇంట్లో అందరు ఎవరికి వారే వేరైనారంటాడు.
దుఃఖంతో కూలుతున్న గోడల మధ్య



అవ్వొక్కతే నిలబడి ఏడుస్తుంది.
ఇల్లూ, ఊరూ మునుపటి రూపాన్ని కోల్పోతాయి.
ఊరవతలి పూరిగుడిసె దగ్ధమవుతుంది.
మహా సామ్రాజ్యం వంటి ఇంటిముందరి ముసలిచింత
నేలమట్టంగా నరకబడుతుంది.
దాని మీది కొంగలతోపాటూ నేనూ నిరాశ్రయున్నవుతాను.
నిన్న చల్లగా స్పృశించిన సహచరుని హస్తం
నా చుట్టూ ఇపుడు ఉచ్చులు బిగిస్తుంది.
ఆప్యాయంగా నవ్వినట్టున్న చిరునవ్వే
నా వెనుక విషపుకోరై కాచుకుంటుంది.
ఇపుడు విశ్వాసం ధ్వంసమవడం హింసే
మనిషి విచ్ఛిన్నమవడమూ హింసే!
ఒక్కసారి జన్మించి
ఒక్కసారే మరణిస్తామనుకుంటాం
కానీ మనకు తెలియకుండానే
చావుపుట్టుకల మధ్య
చాలాసార్లు జీవించి, మరణిస్తాం
పొగచూరిన వంటిళ్ల మధ్య
చల్లని నాలుగు గోడల మధ్య
యంత్రాల ముందు యంత్రాల వలె
ముఖాలు లేకుండా నాకు చాలా శవాలు కనిపించినై
ఒక సాయంత్రపు చెరువుగట్టు మీద
పేపరు, పెన్సిళ్ల మధ్య మేఘాలను బంధిస్తున్నపుడు
నాకు నిజంగా జీవించినవాళ్లు కనిపించినారు
పిల్లబాటల వెంట ముళ్లపొదల మీది గడ్డిపూవులై
దిసమొలల్తో బురదనీటిలో ఆడుకునే పసిపాపలై

*10.10.1998*



# లెనిన్ గాయం

గాయాన్ని పూడ్చినంత మాత్రాన
జ్ఞాపకం మానుతుందా?
శవఖననం చేసినంత మాత్రాన
సిద్ధాంతం మూగదవుతుందా?
మాటిమాటికీ ఎందుకూ?



ఎన్ని జ్ఞాపకాలను తగలెయ్యగలవో చెప్పు
మేం పుస్తకాలను విడుదల చేస్తాం!
సిద్ధాంతపు గాయం మీద
ఎన్ని ఎన్‌కౌంటర్లు చేయగలవో చెప్పు
మేం మా హిట్‌లిస్ట్ తయారుచేస్తాం!
పూత పూయాల్సిన గాయం మీద
కారం పూస్తే మంట పుట్టదూ
సామాజిక చికిత్స అంటే
వ్యవస్థ చెడురక్తాన్ని నిర్మూలించడం గానీ
శవఖననం చేసినట్లు గాదు
భౌతిక గాయమైతే బాగుండేదే
రసాయన గాయం కదా! రగులుతుంది జాగ్రత్త!
భౌతికమైనా, రసాయనమైనా
చర్యకు ప్రతిచర్య వుంటుంది.
కాలానికి గిరిగీయగలవేమో చెప్పు
చైతన్యాన్ని చెరిపేయగలవేమో చెప్పు
గాయమెప్పుడూ భౌతికం కాదు.
గొంతెప్పుడూ మూగబోదు
రూపం మారుతుందంతే!

*10.11.1993, మబ్బుల 4 గంటలకు*
*'ఎడపాయలు...' సంకలనం*



# చాటింపు

మా తాతల బాకీలకు తాకట్టైనోళ్ళం
మీ భూమిని నాగళ్ళమై దున్నినోళ్ళం
మీ పొలాలకు కాలువలమై పాకినోళ్ళం



మీ పొలాల్లో నాట్లేసి, కలుపుదీసి, వరికోసినోళ్ళం
మమ్ముల మీ పొలాల్లో పరిగేరుకోనియ్యరా?
నోట్లెకు నూకల్లేనోళ్ళం మమ్ముల కల్లం ఊడ్చుకోనీయరా?
కనిపిస్తనే వున్నది ఏరుకునే పరిగెను కూడా
వారి భవిష్యత్తును జమకట్టి
మీవాళ్ళతో ఫోటోలకు దండలేయించుకోవాలనే ఆరాటం.
మేం నీళ్ళసొంటోళ్ళం మమ్ముల నీళ్ళలెక్క వాడుకోకుండ్రి.
భూమి కంటె నీళ్ళు మూడురెట్లెక్కువని మాకెరికే!
మా చెమటను ఉప్పుగా మార్చుకున్నంగానీ
మీ ఉప్పు మేమేనాడు తినలేదు.
రాత్రంతా మోటలు గొట్టి మా బతుకులను
పాటలతో తెల్లార్చుకున్నం
మాకు ఏటికేతంబెట్టే సత్తా వుంది.
మాలో సముద్రమంత శక్తి వుందనడానికి నిదర్శనం
మా రక్తం మరిగినపుడు చిందిన చెమట రుచి చాలదా?
మేమంతా మీ ముందు
చెప్పులు చేతబట్టుకోని నడువాల్నా?
చర్మం వొలిచి చెప్పులు కుట్టుడే గాదు
డొక్క చీల్చి డోలుగొట్టేది మేమే!
మేమెంత వెనుకబడ్డ వాళ్ళమైనా
మేం ముందుంటెనే
మీ పెండ్లీలు ఊరేగించబడుతయ్!
మీ శవాలు ఊరవుతలబడుతయ్!!

*6.10.1993,* ప్రజాసాహితి
'చిక్కనవుతున్న పాట' సంకలనం

# పదును



నీ చేనుకాడ చలిమంటల కాపలా వున్నందుకు
నేను ఈదుకోవాల్సిన కలలన్నీ
నా కళ్ళలో ఎర్రచారికలై నిలిచినాయి
నీ పశువులను మేపినందుకు నా బాల్యపు పాటలన్నీ
అడవిలో పలుగురాళ్ళయి మొలిచినాయి.



నీ వినోదం కోసం నేను చిటికేసి, చిందేసిన ఆటలన్నీ
బతుకమ్మ తంగేడిపూలై పూచినయ్!
పెండ్లి పెద్దరికంతో నీవు చల్లిన చిల్లర పైసలు
డప్పు వాయించిన నుదుటి చెమటతో నేనందుకుంటే
అదే నీకు పెద్ద హోదా అయింది.
సాహసించి నేను చచ్చినగొడ్డు చర్మమొలిచి
అన్నింటా ముందున్నందుకు అంటరానివాన్నయినాను.
పదునెక్కాల్సిన నా గొంతును
నీ వూరి చాటింపుకే వాడుకున్నావు.
నేనిపుడు గజ్జెకట్టి చాటించదలచుకున్నది
నీ గుట్టు రాజకీయాలను
నేనిపుడు అసహ్యించుకోదలచుకున్నది నీ అమానుషత్వాన్ని
నేనిపుడు కోరుకునేది
నీ శవం మీద చల్లుటకు పిడికెడు చిల్లరపైసల్ని
నేనిపుడు గొంతెత్తి పాడదలచుకున్నది
నువు నన్ను చింతచెట్టుకు విరిచికొట్టిన బరిగెదెబ్బల్ని
నేనిపుడు కలలు గనేది
నిన్ను చక్కగ నడిపించే చెప్పుల నమూనా కోసం
ఇక నుంచి ఊరవుతలి మా గుడిసెల్లోంచి
పనిగట్టుకుని నూరుతున్న
'పనికత్తుల' శబ్దాలు వినిపిస్తాయి.

*4.6.1995, ప్రజాసాహితి*



# నేనే రాజ్యం

- 14వ లూయి

"నీకు విరోధముగా రూపింపబడిన
యే ఆయుధమూ వర్ధిల్లదు"

- యెషయా 54 : 17

పెదవుల కంటిన నెత్తురును చప్పరించి
క్షణక్షణపు క్షిపణీ పహారాలో సింహమొకటి నిద్రిస్తున్నది
కలలో కూడా కూలని స్వేచ్ఛకు
కలుగుల్లోంచి చిట్టెలుకల అంతరాయం
బ్రహ్మాస్త్రానికి దొరకని పిచ్చుకల రొద
నెత్తుటి మడుగులో విలవిల్లాడైనా సరే
ఏది నిజమో తేల్చాలని
ఆయుధానికి అటూ యిటూ నిఘా
పరలోకాల నుంచి అప్పు మింగిన ప్రాణాలు
అణ్వాయుధాలు పేల్చిన 'నాంఫెన్' బడిపిల్లల ఆర్తనాదాలు



బాగ్దాద్ ఆసుపత్రి వధ్యశాల గావుకేకలు
"గాయపడ్డాము తండ్రీ! ఎవరు నాయనా నీ అసలు బిడ్డలు?
భూమి అంగడయింది. ఆకాశం ఆయుధమయింది.
నెత్తురు సముద్రమయింది.
దొప్పనిండా తేనెను తాగేవాడు పెప్సీ, కోలాలు తాగుతున్నాడు
విల్లునెక్కుబెట్టినవాడు బుల్లెట్‌దెబ్బకు ఒరుగుతున్నాడు.
ఆయుధమూ, వాణిజ్యమూ అడవుల్లోకి చేరుకున్నయ్
ఇక్కడ నేలకూలిన కౌజుపిట్ట నెత్తురు
అక్కడ కౌబాయ్ చేతికంటుతున్నది
ఎన్ని పులుల్ని గాయపరిచింది వేటగానికి గుర్తుండదు.
దెబ్బతిన్న పులులు మాత్రం కాచుకుని కూర్చుంటయ్!
బోస్నియా, పాలస్తీనా, సెర్బియా, ఇరాక్
దేశమేదైతేనేం?
ఇనుపబూటుకింది పీడనం
హైజాక్ విస్ఫోటనమయింది
పీడనదొక రూపం! విస్ఫోటన మరో రూపం!
నాడు కనిపెంచినవాడే నేడు కనిపించని శత్రువు
అది నువ్వు నడిచిన దారే!
అది నువ్వు 'స్వేచ్ఛ'గా పెంచిన పామే!
ఇపుడు నీ దారి కడ్డంగా నిలుచున్నది.
నువ్వు చేసే క్రూసేడు జిహాద్‌గా మారుతున్నది.
కనిపించని నిందకు కనబడని బొంద తెగుతున్నది.
తాను సృష్టించిన కనిపించని శత్రువుపై
ఎటు గురిపెట్టాలో తెలియక
నెత్తుటి మరకలతో శిథిలాల మధ్య నిలబడి
'డాలర్ టఫ్ గయ్' అంకుల్‌శామ్ అన్నాడు
"నేనే రాజ్యం!"

13.10.2001

# నువ్ నా ఎదుట



నిన్న సాయంత్రం
నువ్ నా ఎదురుగా కూర్చుని మాట్లాడినపుడు
నాకు శవంతో మాట్లాడినట్లనిపించింది.
నువ్వేమిటి? రాజ్యమే వ్యాపారమైనపుడు
మనిషి స్థానంలో రూపాయే నిలబడుతుంది.
రేపటి జన ప్రపంచాన్ని చూపాల్సిన బుద్ధిజీవులు
డాలర్ల మేతకు మెడలు చాస్తాయి.
ఇక రేపటి నుంచి
చుట్టూ కిటకిటలాడే యంత్రాల మధ్య నువ్వుంటావు
తగలబడుతున్న అరణ్యం మధ్య గురికాచుకుని నేనుంటాను



నువ్ కరెన్సీ సౌధాలు నిర్మిస్తే
నేను కవితా సంకలనాలు ఆవిష్కరిస్తా!
నువ్ నియాన్ లైట్ల వెలుగులో మెరిసిపోతే
నేనిక్కడ మట్టి నక్షత్రాలు సృష్టిస్తా!
పడగెత్తిన కంప్యూటర్‌కు
నువ్ పాలుపోసి పెంచుతున్నావు
మట్టికి ప్రాణం పోసి నేను
ముంగిసలకు శిక్షణ నిస్తున్నాను.
ఆర్థిక నియంతృత్వంతో
నువ్ ఆకాశంలో విహరిస్తే
నేను భూమి ఉపరితలం మీద చెవి ఆనించి
భూగర్భంలో జరిగే సంక్షోభాలను వినగలను.

సాఫ్ట్‌వేర్! డాలర్స్!! బిల్‌గేట్స్!!!
శ్రమ! ఆకలి!! సమూహం!!!
నువ్ రూపాయికి తలవంచే బానిసవైతే
నేను జనంలోంచి దూసుకొచ్చే శక్తి శకలాన్ని
నేను పోరాటాన్ని శ్వాసించి ప్రజల్లో జీవిస్తే
నువ్ డాలర్‌కు ఉరేసుకుని
సాంఘిక మరణం పొందుతావు
నేనిక్కడ ఆకలీ, అన్యాయాలతో తలపడుతుంటే
నువ్వక్కడ నాలుగ్గోడల మధ్య
నా లక్ష్యాలను తలచుకొని
నిద్రలో కూడా భయకంపితుడివౌతావ్!
ఇవాళైనా, రేపైనా, ఎప్పుడైనా
నువ్ నా యెదుట పరాజితుడివే!

ప్రజాసాహితి




# పత్తికాయలు పగిలిన చప్పుడు

ఒక నిరంతరమైన ఆకలీ, చెమటను పరిహసించే రూపాయీ కలిసి
ఇప్పటిదాకా తలెత్తుకున్న మనిషిని అవమానపరుస్తాయి.
పచ్చనిపంటకే కాదు, ఇవాళ మనిషితనానికీ పురుగుపట్టింది.
విశ్వాసాలను ధ్వంసం చేయడం
మట్టి అంటకుండా మనుషుల్ని హత్య చేయడం
మహారాజు కుర్చీ ముందు కదులుతున్న పావులు
నేరం రుజువు కాదుగానీ
హత్యకు, ఆత్మహత్యకు తేడా ఏమిటి?
ఒకప్పుడు హత్యలు అడవులకే పరిమితమనుకున్నాం
ఇపుడు గ్రామాలకూ ప్రవేశించినాయి
ఒక కల్తీమందు, ఒక తుపాకి, ఒక అరిగిన రూపాయి



మూకుమ్మడిగా పన్నుతున్న పథకాలు
మనిషిని నిర్మూలించెటందుకు
రూపాయి - హింస మన కళ్లముందే
అజ్ఞాతంగా సంచరిస్తాయి
రాత్రంతా నిద్రలేక ఉదయం దిగులుగా లేచిన మట్టి సూర్యుడు
సాయంత్రానికల్లా పత్తిచేనులో అస్తమిస్తాడు
ఒక ఇల్లాలు కంట్లో ఒత్తులు అకస్మాత్తుగా ఆరిపోతాయి.
చీకటింట్లో ఆమె ఇంటి దీపాన్ని వెదుకుతుంది.
తీరని చీకటితోనే ఇల్లంతా తెల్లారుతుంది.
ఒక నిలువెత్తు శ్రమ, నిండైన త్యాగం
నట్టనడి చేనులో బెదురై నిలబడుతుంది.
భూమిని అమాంతం చాపవలె చుట్టగల
రెండు బలమైన హస్తాలు
అసంకల్పితంగా నిర్జీవమవుతాయి.
మనమందరం చూస్తుండగానే
రాజు పల్లకీకి ఎదురుగా రైతు శవం ఊరేగించబడుతున్నది.
ఏ నేరం లేకుండానే ఎక్కడివీ శిక్షలు?
ఒక్క రూపాయి భారం ముందు
ఎన్ని ప్రాణాలు దూదిపింజలవుతున్నాయ్!
ఒక్క మరణంతో
ఎన్ని సాఫల్యాలు విచ్ఛిన్నమవుతాయో కదా!
ఇన్ని మరణాలతో
ఇంకెన్నెన్ని జీవసంబంధాలు తెగిపడతాయో!
రేపు మన భార్యాబిడ్డలు తినే తిండి చేదెక్కక ముందే
వాళ్లను బతికించుకుందాం!
మనం బతుకుదాం!!

*6.3.1998*
*వార్త 'సృష్టి', శనివారం*



# బహురూపాలు

శరీరమంతా రూపాయి మందు పట్టించుకున్నంక
ఏ విలువలైనా రూపాయిల్లోకే మారతాయి
మనింటి టీవీలో చేపలు తినని తెల్లకొంగ
చెరువుగట్టు మీద కూర్చుంటుంది.
నేను చిన్నపుడు చేపపిల్ల చందమామ వలె వుందనేవాన్ని
కానీ మా చిన్నోడు మాత్రం
రూపాయిబిళ్ల వలె మెరుస్తున్నదంటున్నాడు.
ఇదేమిటీ! నా చేతిలోని రూపాయి
గోళాకారంగా మారిపోతున్నది



ఇక్కడి గోడమీది వ్యాపార ప్రకటన
ధాన్యపుబస్తాలోంచి రూపాయినాణాలను కుమ్మరిస్తున్నది.
గుండె కూడా ఏ స్పందనా లేకుండా
ఖచ్చితంగా యంత్రమువలె కొట్టుకుంటున్నది.
రంగులను ఎరజూపి మత్స్యన్యాయం
ఛానళ్ళ నిషాలో జోగుతున్నది.
పల్లెల అరుగుల మీద బీడీలు చేసే మట్టిచూపులు
దూరతారలను దర్శిస్తాయి.
చేసే శ్రమ దోయబడడంతోబాటు
శ్రమించే శక్తీ హరింపబడడం
కౌబాయ్ గన్‌షాట్‌కు రెండు చేతుల కష్టం
రక్తంలో కొట్టుకుంటున్న పిట్టలవలె తల్లడిస్తుంది.
మన తలలను చతురస్రాలుగా చేసి,
నరాలను ఛానల్స్‌గా మార్చి,
పట్టపగలు కలల్లోకి నడిపిస్తున్నాడు.
హిరణ్యకశిపుని చెవికుండలాన్ని
రావణుడు మోయనిది నిజమోకాదో గానీ
నిజంగానే మన తాతల ముంజేతి కడియాలను
మనం మోయడం లేదు.
మనమధ్య రహస్యంగా సంచరిస్తూ
మనలను అన్నివిధాలా క్రయీకరించే
రూపాయి ముఖాన్ని ఎక్కడా చెల్లకుండా చేద్దాం.
మన బలహీనతలన్నీ
వాని రిమోట్ కంట్రోలర్‌గా మారకముందే
మన కాళ్ల కింద కింద విస్తరిస్తున్న
స్లోపాయిజన్‌ను ఎక్కడికక్కడే తొక్కేస్తే!?

21.4.1996
'మొగులైంది' సంకలనం




# హ్యూమన్ ఫర్ సేల్ డాట్‌కామ్

తలపుట్టలో పాముల కదలిక!
అందని సరుకు నిప్పుల మధ్య మనిషి దహనం
చిత్రమింకా పూర్తి కాలేదు.
మనిషి నడిచి వెళ్తున్నాడు
వస్తు ప్రపంచాన్ని జయించుకొద్దామని!



కలిసి గెలుద్దామని, కలిసి బతుకుదామని
తెగించిన చోటనే నడక మొదలయింది.
తిరిగొచ్చేటపుడు తలలేదు, సరుకు మింగింది.
ఓడిపోయి వస్తున్న మనిషీ! మనిషీ!!
నీకూ నాకూ మధ్య దూరమెంత?
ఏదో ఒక సరుకంత!
ఇపుడు జీవితం కన్నా సరుకు ప్రేమ గొప్ప!
మనుషులంగడి సాగినాది!
నీ విలువ, నిన్ను కొనేవాని చిరునామా
తెరమీద చూపుతారక్కడ
మార్కెట్ చిరునవ్వులన్నీ నువు సరుకయ్యేంతవరకే!
ఇక ఏ ప్రవాహాలుండవు. అన్నీ ప్యాకేజీలే!
'థేమ్స్ వాటర్' కంపెనీ పిడికిట్లో 'నీరు' గడ్డకట్టిపోయింది.
'భూమి' సరే! గాలీ భయపడుతున్నది
నన్నెక్కడ అమ్ముతారోనని!
అంగడి నీ ఎడమచేతిని కట్టేసి
నీ కుడిచేత్తో నీ గొంతును నులుముతున్నది.
ఆకాశం నిండా దుఃఖం కురుస్తుంటుంది
ఎక్కడనో ఒక మనిషి
'కొడిజివునం'తో వాకిట్ల నిలబడి
మొగులు దిక్కుజూసే కండ్లల్ల
వానరాదు! ప్రాణం పోదు!!

9.8.2001



# కొన్ని అసహజాలు

సింహాసనం నిలబడే వున్నది
ఒక పాత్ర పోషించవలసిన రాజు
ప్రతిపక్ష పోషించుచున్నాడు

నెత్తుటి మరకలేం లేవు
రాజదండము కరవాలంగా మారుతున్నది



యుద్ధాలు కనిపించుటలేదు.
ఏకరూపంలో వుండే శత్రువు
అనేకమై పరోక్షమగుచున్నాడు

మనుషులు తలలు మార్చుకుంటున్నారు
వస్తువును సృష్టించిన మనిషి
వస్తువు ముందు మోకరిల్లుతున్నాడు.

సవతులనుకున్న లక్ష్మి, సరస్వతులు
జతగా విదేశీ విహారం చేస్తున్నారు
డాలర్ + కంప్యూటర్ = అమెరికా
రూపాయిల్లోకి మార్చుటకింకేమీ లేదు
సహజాతి సహజంగా
కొండవాలు నుంచి జాలువారిన జీవజలం
కంపెనీ బాటిల్‌గా 'ప్యాకెట్‌ధర'గా మారినది.
కనిపించని హింసలు, కములుతున్న రక్తనదులు
ఎవరి యెదుట నిలబడ్డా, ఏదో కమురు సెగ
ఎందుకో మనిషి లోలోపల కాలుతున్న వాసన!

వేసే ప్రతి అడుగునూ, ప్రతిక్షణమునూ
ఒక సందర్భమూ, మట్టీ, మనిషి కాక
కరెన్సీ నిర్ణయించడం, అసహజం అసహజం

*5.9.2003,*
*వివిధ, ఆంధ్రజ్యోతి, 15.9.2003*



# అమెరికన్ ఈగిల్

గ్లోబు నిండా నెత్తుటి ధారలు
నీది రెక్కలు తెగిన గొంతు

బ్రహ్మా! నీకిపుడు క్లోనింగే అమ్మ
విష్ణుమూర్తీ, నీదిపుడు ఇంటర్నెట్ విశ్వరూపం
శివశివా! నీ గంగ నీళ్ళసీసాలో బంధితం



చుట్టూ గట్టి భద్రతావలయం
ఈశ్వరా! పట్టుకో ఇంటిదొంగలను!
జై గణేశా! విదేశీ కంపెనీ నడక నిర్విఘ్నంగా సాగనీ,
ఓం డాలర్ సర్వ విఘ్నోపశాంతయే!
రామా! మేము అమెరికాకు రామా!
వెంకటేశా వరల్డ్ బ్యాంకు అప్పు
వడ్డీకాసులు వసూలు చెయ్
జై భవానీ! చెయ్ ప్యాకేజీ
ఏడీ వీర శివాజీ!
పదునెక్కిన ఛత్రపతి ఖడ్గం
బ్రిటిష్ మ్యూజియంలో భద్రం
బీటలువారిన పంటపొలాలు
క్రికెట్ క్రీడా మైదానాలు
జమ్మిచెట్టు మీది నీ ఆయుధాలకు
అమెరికన్ ఈగిల్ కాపలా!

గ్లోబు నిండా కన్నీటి చారలు
గొంతు తెగిన రెక్కలు నీవి.

1.2.2004



# జాడవట్టే పిలుపు

ప్రత్యామ్నాయం లేదు
ఇగ వేరే దారిలేదు
అన్ని దారులూ మూసుకపోతున్నప్పుడు
ఇన్ని దాడులు చుట్టుముట్టినపుడు
ఇగ దప్పదు. నిండా మునగక తప్పదు.



అందకపోవడానికది స్వప్నం కూడా కాదు. పచ్చి నిజం!
పగటి కలలు కనడానికి
మనమున్నది వెలుగులో కాదు. కాళరాత్రిలో!
ఇంకా తెలవారలేదు.
చీకటికి భయపడటంగాదు.
దాన్నే వ్యూహంగా మార్చుకుందాం.
లక్ష్యం నిర్ణయించక కాదు
మార్గం తెలియకా కాదు
ఎవరు నడిచిన దారి యిది?
ఎక్కడ మనం దేవులాడేది?
ఎక్కడికక్కడ నిలబడి, గిరి గీసుకున్న హద్దుదాటి
ముందు నడిచే కాళ్ళను నరికే నడుమంతరపు కుట్రలు వదిలి
ఒక సన్నివేశంలో మనం కలిసే 'యాళ్ల' యిది
తప్పిపోయిన గొర్రెను వెదికే గాలింపులో వున్నం
ముసలి చింత కింద తిరిగే గానుగెద్దు కన్నులో
మన బతుకు చిత్రాలు తిరుగుతుంటయ్!
ఏడ్పీ, ఏడ్పీ ఎక్కిళ్ళు మిగిలినయ్!
కలుపుదీద్దామంటె కటికనేల మిగిలె
యిగ మునుంబట్టేదేమున్నది? గెట్లునాటుడే!
కోడిగూసే జాము ముసలయ్య దమ్మువట్టే
చుట్ట మీది కుంపటి మిణుగురుదీ
పని మరచిన కొడుకును జాడవట్టే అవ్వ పిలుపుదీ
'ఉశికె'లో 'కాసెపుల్ల' ఆడే పిలగాండ్ల దేవులాటదీ
ఒకటే తొవ్వ!
అది తెలంగాణా తెలంగాణా
తెలంగాణా తెలంగాణా!

*'పొక్కిలి' సంకలనం*
*9.8.2001*



# కౌంట్‌డౌన్

పది కాలాల అణచివేత, వెనుకబాటుతనం
తొమ్మిది జిల్లాల తెగువారం
ఎనిమిది దిక్కులు ఒక్కటై గర్జించే నినాదం
ఏడు సముద్రాల ఆవలి మాయగానిచేతి రిమోట్ కంట్రోలర్
ఆరు గాలం శ్రమించే మట్టిజీవితం!
పంచ ప్రాణాలు గాలిలో కలిసే అప్పు
నలుగురు నవ్వే అవమానం
మూడు కోట్ల ఆశల ఎదురుచూపు
రెండు ప్రాంతాల అభివృద్ధి వ్యత్యాసం
ఒకటే తెలంగాణా!

17.9.2003





# నీటి దుఃఖాలు

మొగుల్నిండ దుఃఖపు వానతెప్పల ఊయల
ఎటువెళ్ళినా సముద్రమే... ఆకాశపు సముద్రం
చినుకురాలది... నీరుండది
ఎపుడో ఓసారి ముసురు ముసురుగా
తాటికమ్మల చూరు ఏడుపుకు

గుడిసె గోడ కరుగుతుంటది
ఎటుజూసినా మంటలే! నిప్పు కనబడది
పాలువట్టిన కంకిని వొలిసి సూత్తె
చేతివేళ్ళకు నెత్తుటి తడి!
ఎటువెళ్ళినా అఖాతమే... దరిదొర్కది అప్పు దీరది
త్యాగాలు పండిన కళ్ళంల గూసున్నం
పంట అట్నుంచటే అంగడికి
కాపు బీదయితే కళ్ళమూ బీదదే!
ఎటు జూసినా మోసమే అంతుదొర్కది
కన్నకడుపు మీద చిగురు పాదాల స్పర్శ
ఓ కొడుకా! జమ్మిచెట్టు మీద ఆయుధాలుంచినపుడే
ఒక నమ్మకద్రోహానికి చిక్కినం
నీ చుట్టూ ఎన్నో రూపాలు! పాలోల్ల రూపాలు
ఏదీ నీ చెయికి దాకది ఏ చేయి నిన్నందుకోదు
నిండ మునుగుడే నీ పని
ఎప్పటికెరుక! పాలోడు పదిరాళ్ళెక్కువనే మీదేత్తడు
ఇపుడు మన భూమి రజాకార్ల ముందు మారేశమేస్కోని
మాదిగవాడల దందెడ పేనుతున్న కుర్రారం రాంరెడ్డి పక్కన
నారకట్టల పొంచివున్న బందూక్!
నెలబాలున్ని వీపుకు గట్టుకున్న
ఒక తల్ల యిల్లిల్లూ దిరుగుతున్నది
తెల్లారుతున్నది లెంబ్రి బిడ్డా అని
మన వాకిట్ల నిలబడి మేల్కొల్పుతున్నది.

నేటినిజం, సోయి
17.9.2002





# నా తల్లి తెలంగాణా

ప్రమాదాల శైశవదశను చిటికెన వేలు పట్టి నడిపించిన నడక
కాలుతున్న ఇసుకలో అక్షర తూణీరాలను మోస్తున్నపుడు
లేలేత పాదాలకు తొడిగిన మోదుగాకు చెప్పులు,
గొంతెండిపోయి అలమటించినపుడు

ఎదురుగా వచ్చిన చల్లని నీటిచెలిమె
కోడిగూసే యాళ్లకు దీపం ముందు చదువుకున్న పాఠం
మట్టిగోడ మీద గీసిన చిలుకబొమ్మ
ఉన్న వూరును విడిచి అప్పుదీర్చుట కెళ్లిన వలస బతుకులు
ఆకలితో తిన్న కారం మెతుకులు
వడ్లు దంచిన దొరగడీలలో తిరగబడ్డ రోకండ్లు
నైజాం నఖరాలను మెడలు వంచిన వీరగాథలు
అమ్మా! ఇవి నా అమరస్మృతులు
మసకబారిన చూపులతో
నుదుటిమీద అరచేతినుంచి నువ్ చూస్తున్నపుడు
నేను రంగురంగుల సీతాకోకచిలుకలను అలుపెరుగకుండా
వెంటాడుతాను

వర్షం వెలిసిన తర్వాత ఉశికెలో నీ పాదాలకు చల్లని
పిట్టగూడు కడతాను

లేచి నిలబడి మౌనంగా నడుస్తుంటాను
నడక సాగుతూనే వుంటుంది
అక్కడ గుట్టబోరు కింద నల్లచట్టపు టాడా పడగనీడలో
గుట్టుగా రాబందుల సమావేశం జరుగుతుంది
ఇక్కడ నిశ్శబ్దంగా కలం పట్టి రాస్తున్న నా చేతిని
అకస్మాత్తుగా ఒక ఇనుపపాదం నరుక్కుని పోతుంది
అక్కడ పథకం ప్రకారం తెగిపడ్డ ఐదు నక్షత్రాలు
నాటేసే పొలాల్లో రాలిపడతాయి
అమ్మా! నీతోపాటు కొందరు తల్లుల
సంవత్సరాల ప్రశ్నాసమూహాలకు
ఏ హెచ్చరిక లేకుండా చుట్టుముట్టబడి
బురదలో దిగబడ్డ మట్టిపాదాలు సమాధానాలవుతాయి
చెట్లు కన్నీళ్లు తుడుచుకుంటాయి
రాళ్ళు గాయాలను తడుముకుంటాయి



సాయంత్రం సూర్యుడు
రక్తపు మరకల్ని కడుక్కుంటాడు
ఇవాళ అప్రకటిత యుద్ధంలో
మనిషి పొందే ఆశ్రయం తెలంగాణా
వెంటాడే శత్రువును
మర్లపడి ఢీకొనే యోధుల పౌరుషం తెలంగాణా
చిరకాలపు దుఃఖాలను చూసి
నోళ్లు తెరిచిన బీళ్లను చూసి
తల్లడిల్లే నల్లమబ్బు నా తెలంగాణా

మృత్యువుతో తలపడినప్పుడు
చేతుల్లోకి తీసుకొని
నుదుటిని ముద్దాడే భూమితల్లి తెలంగాణా
ఇవాళ తెలంగాణ పల్లె పొలిమేరలల్ల
వలపోసే ముసలవ్వ మట్టిదోసిళ్ళు,
పంటసేనుకాడ కాచుకొని కూచున్న
బక్కరైతుల గుత్పకట్టెలూ
పొదలచాటునుంచి పొంచిచూసే ఖడ్గనేత్రాలు
పదునుగా విచ్చుకున్నా గోగుపూలూ
జేజేలు పలుకుతాయి

*1.11.1998*
*మత్తడి సంకలనం, ఎడపాయలు సంకలనం*



# తెలంగాణా స్కూల్ అసెంబ్లీ

వందేమాతరం, బందీమాతరం
నిర్జలాం నిష్ఫలాం
రోజూ ప్రార్థన చేస్తనే వున్నం, వినేదెవరు?

మా తెలుగుతల్లికి మల్లెపూదండ
గలగలా గోదారి కదలిపోతుంటేను
విలవిలా మానేల ఎండిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
కటకటా కరువమ్మ వచ్చి నిలుచుంటేను

.......... ........... ...............



మాభూమి మా నీళ్ళు దక్కి తీరేదాక
మా ఆటలే ఆడుతాం! మా పాటలే పాడుతాం
జై తెలంగాణా! జై తెలంగాణా!!

తలెత్తుకుని ప్రతిజ్ఞ చేస్తున్నం
ఆంధ్రరాష్ట్రము నా జన్మభూమి
ఆంధ్రులంతా నా సహోదరులా?
సుసంపన్నమైన బహువిధమైన
ఆంధ్రవారసత్వ సంపద మాకు సర్వనాశనం!
వారి శ్రేయోభివృద్ధులే మా దుఃఖానికి మూలం

### వార్తలు

తెలంగాణ నీళ్ళకు గండికొట్టిన ఆంధ్ర
సారవంతమైన భూముల ఆక్రమణ
రైతులకు మరొకసారి కరెంట్‌షాక్
కిరాయి క్రీడల్లో వీరాంధ్ర!

### సూక్తులు

1) వెయ్యేండ్లున్నా వేరుదప్పది
నూరేండ్లు బతికినా సావుదప్పది

2) నీరు ఆంధ్ర నెరుగు
నిజము తెలంగాణమెరుగు

### అతిథి సందేశం

తవ్వేడిచ్చిన కాడ తంగేళ్ళు వీకాలని
ఎక్కడోళ్ళక్కడ బతుకవోయింద్రు
ఏమ్మాట్లాడాలె! ఇండ్లన్ని బల్లిపాతర్లు వట్టినయ్
పెద్దలను యాది జేసుకొని ఏడుద్దామంటె
పెత్తరమాసనాడు ఇంట్ల 'శారెడు' బియ్యం లేవు
బతుకు అంగడికీ, యింటికీ మధ్య దూరమయింది.

ఉప్పేసి పొత్తుగూడిన పాలోడా!
నర్రెంగ జెట్టు కింద నూకలు జల్లి వలపన్నిన మోసగాడా!
గొర్రెంకలు నీ పన్నాగాన్ని పసిగట్టినయ్
అది బంగారి కత్తని మెడగోసుకుంటమా?
ఎవనికి బంగారమైందో, ఎవల మెడమీద కత్తైందో ఎరుకైపాయె
తెలుగుతల్లీ! ఎన్ని గాయాలు పూసినా
మాకు దక్కని రాజ్యం దుఃఖమే యిచ్చింది
ఇన్ని గోసలు మా గోటి చుట్టు పోటెత్తినపుడు
ఇగ మా రోటికాడ మా పాటలే పాడుకుంటం

### ప్రధానోపాధ్యాయుని సందేశం

మనదిగాని భాషల చదువుతున్నం
పాలిభాషల పాఠమెట్ల అర్థమైతది?
తెలుగు పాఠం చెప్పుదామంటె
మన జానపద దుఃఖాలు వినబడుతున్నయ్
గణిత పాఠ్యాంశపు లాభనష్టాల లెక్కల్లో
మా నష్టాలే ఎక్కువ
ఇక నుంచి అట్లగాదు
సాంఘిక శాస్త్ర ప్రశ్నాపత్రంలో
తెలంగాణా సంస్కృతిని గురించి రాయండి అని
వందమార్కులకూ ఒకటే ప్రశ్న అడుగుతాం
ఆఖరి పీరియడులో నల్లబల్ల మీద
గుండెపటం గీద్దామంటే
అది తెలంగాణా చిత్రపటమయింది.

### ముగింపు

జనగణమన తెలంగాణా జయహే!

*సోయి, 17.9.2003*





## తుమ్మల్లో గుంకిన నల్లపొద్దు

ఆమె చేయి దేన్నో వెదుకుతుంది
చిన్ననాడు కట్టుకున్న బొమ్మరిల్లు కోసమో
వాగొడ్డు పిట్టగూడు పక్కనుండే మంచినీటి చెలమ కోసమో
కష్టపు బతుకులో వెంట నడిపించుకు వెళ్లిన
భర్త అడుగుజాడల కోసమో
అతనికి దీటుగా చేసిన శ్రమకి చేతుల్లో తేలిన మట్టిగీతల కోసమో
వీపు మీద కొడుకునెత్తుకొని ఆమడల కొద్దీ దూరాన్ని
కాలినడకన వెళ్లిన తల్లిగారి ఊరి పిల్లబాట కోసమో
చేనులో పెరిగిన కలుపుమొక్కల కోసమో
వరి కోసిన మడిలో కళ్ళంగింజల కోసమో
ఎందుకో ఆమె వెదుకుతూనే ఉంటుంది

ఏమేమో కలవరిస్తుంది
ఇంటింటికీ తిరిగి ఆమె పాడిన హోళీ పాటల రాగాల కోసమో

ప్రవాసంలో ఉన్న కొడుకు పాదాల అలికిడి కోసమో
ఇంకెందుకో ఆమె పలవరిస్తూ ఉంటుంది

ఎర్రెర్రటి ఎండల్లో మిట్ట మధ్యాహ్నాల 'సల్లగడుక' ఆమె
కొరకే చలికాలపు ఉదయాలలో నను బడికి పంపిన
'ఉడుకు బువ్వ' ఆమె

నా అక్షరాల నిండా చెమట చమురు ఆమె
నా బతుకు పుస్తకం ముందు
కోడికూసే జాము కంటిదీపం ఆమె

కాలం రెండు ముక్కలై తిరిగి
ఆకలి ఆమెను, నన్ను ఎడబాపిన యాళ్ల
నా కంఠంలో చనుబాలు సుడులు తిరిగిన బాధ

పిల్లలకు రెక్కలొచ్చి ఎగిరిపోయిన
కొమ్మమీది ఒంటరిగూడు ఆమె
ముఖమంతా పొగచూరిన
ఎడతెగని ఎదురుచూపు ఆమె

తల్లివేరు తెగిపడ్డ చెట్టు తల
నేలకేసి కొట్టుకున్నట్టు
నడిరాత్రి పాలకుతి లేసి
పసిబాలున్నై తడిమినట్టు
నేను ఆమె కోసం వెదుకుతుంటాను

నా రెండు చేతుల్తో గాల్లోకి
ఎగరేసిన
పసిపాప కన్నుల్లో ఆమె
ఇంకా మానని గాయాలతో
నడుస్తున్న నా ప్రయాణంలో
తుమ్మల్లో గుంకిన నల్లపొద్దు
నా తల్లి

ఆదివారం ఆంధ్రజ్యోతి, *27-11-2005*